# స్వామి వివేకానంద కవితా వైభవం

ఓగేటి అచ్యుతరామశాస్త్రి

# స్వామి వివేకానంద కవితా వైభవం

ఓగేటి అచ్యుతరామశాస్త్రి

ప్రచురణ :

రిజిస్టర్డ్ నెం. 1/64

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

SWAMI VIVEKANANDA KAVITHA VYBHAVAM
An introduction to the poetic excellence of
Swamy Vivekananda by O. Achutarama Sastry

---



యువభారతి

ప్రచురణ : 96

ప్రథమ ముద్రణ : డిసెంబరు 9, 1983

ప్రతులు : 3,200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైద్రాబాద్.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైద్రాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రూ. 4-00

# యువభారతి పరిచయము

ఉత్తమ అధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరువయ్యేళ్లుగా పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకం వల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారత దేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతీ భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 975 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు
డిసెంబర్, 9, 1983

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి

# మా మాట

భారతీయ పునరుజ్జీవనానికి ప్రతీక వివేకానందస్వామి దివ్యవాణి. దాస్య తమస్సుల్లో చిక్కుకుని దారిద్ర్యంతో, అనైక్యభావంతో, మూఢవిశ్వాసాలతో సతమతమవుతూ స్వీయప్రతిభను గోల్పోయిన భారతీయులకు వివేకానందుడు ఆత్మవిశ్వాస జ్యోతిస్సుల నందించినాడు. దైవంపై విశ్వాసంలేని వాళ్లకంటే ఆత్మవిశ్వాసం లేనివాళ్లు మానవాళికెంతో నష్టం కలిగిస్తారని ఆయన నమ్మినాడు. భారతీయుల తత్త్వజిజ్ఞాసను ఖండాంతరాలలో వెదజల్లి, ఈ వేదభూమికి గొప్ప ఆదరగౌరవాలను సంపాదించి పెట్టినాడు. నిరీహుడై, నిస్సంగుడై, భారతీయులల్లో ఆత్మవిశ్వాసాన్నీ, సేవానురక్తినీ, దేశభక్తినీ, ధర్మాభిరతిని కలిగించడానికి తపస్సుచేసిన మహనీయుడు ఆయన. స్వామి వివేకానందుడు సంస్కృత, వంగ, ఆంగ్లభాషా నిష్ణాతుడు. ఈ మూడు భాషలలో ఆయన కవితాసృష్టి చేసినాడు. ఆయన గీర్వాణవాణి అతిగంభీరం, ధ్వనిమంతం. మనోహరమైన శబ్ద సంయోజనకూ, సముదాత్త భావసంపదకూ, అమోఘ సందేశాత్మకతకూ ఆయన కవిత కాణాచి.

సంస్కృతాంధ్ర, ఇంగ్లీషు భాషల్లో చక్కని అభినివేశాన్ని సంపాదించిన శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు వివేకానందుని సంస్కృత కవితలు కొన్నింటిని తెలుగు వాఖ్య వ్రాసి మాకు ప్రచురణకోసం అందించినారు. శాస్త్రిగారు సంస్కృత భాషలో నాటక ప్రయోక్తలు, నటులు, అనర్గళ ధారాప్రవాహంగా భారతీయ సంస్కృతికి సంబంధించిన అనేకాంశాలపై ఉపన్యాసాలు చేస్తుంటారు. వాగ్మివతంసులు. వృత్తి అధ్యాపనం. ప్రవృత్తి ధార్మికం. ఈ పుస్తకం వ్రాసి ఇచ్చి మా సాహిత్యోద్యమానికి ప్రోత్సాహం కల్పించిన శ్రీ శాస్త్రిగారికి మా హృదయపూర్వకాభివందనాలు.

ఇరివెంటి కృష్ణమూర్తి

9-12-83

అధ్యక్షుడు, యువభారతి.

# స్వామీ వివేకానంద

ఉద్ధర్తుం కర్మస్తారక చర్వణం త్రిభువన ముత్పాటయామో బలాత్
భో! న విజానాస్యస్మాన్ రామకృష్ణదాసా వయమ్.

నక్షత్రాలను రాల్చిపారేస్తాం. ముల్లోకాలను కూకటివ్రేళ్ళతో పెకలించి వేస్తాం. ఓహో! మేమెవరమో నీకు తెలియదుకాబోలు! రామకృష్ణ పరమహంస దాసులం అంటారు వివేకానందులొకచోట. ఎంత గురుభక్తి! ఎంత ఆత్మ విశ్వాసం! ఎంత భావజ్వాల! ఋక్కువలె ఋతంభరమైన శ్లోకమిది!

నేను భగవంతుణ్ణి చూచాను-అని ప్రకటించిన అవతారపురుషుడు రామకృష్ణుడు. అతనిలో భగవంతుణ్ణి దర్శించిన మహాపురుషుడు వివేకానందుడు. కలకత్తాకు దాపున దక్షిణేశ్వరమనే కుగ్రామం, అక్కడొక చిన్న దేవాలయం, అందులో వేంచేసియున్న జగజ్జనని కాళీదేవి, ఆమె పాదాలచెంత పడిఉన్నాడొకపిచ్చివాడు-తల్లీ నాకెప్పుడు కనిపిస్తావే! నన్నెప్పుడు కరుణిస్తావే! అని పరితపిస్తూ, విలపిస్తూ ఆమె పాదాలకు తలబ్రద్దలు కొట్టుకుంటున్నాడు. ఈ అద్భుతాన్ని అల్లంతదూరంలో నిలబడి తిలకిస్తూ చకితుడైపోతున్నాడొక కాగల మహాపురుషుడు. ఇదొక అద్భుతమైన దృశ్యప్రకారం!

అతడొక జీవన్ముక్తుడు. ఇతడొక జిజ్ఞాసువు. అతడొక జాగృత దివ్య చైతన్యం. ఇతడొక సుప్తచైతన్యం. ఇతడు రవ్వ, ఇక ముందు ప్రజ్వరిల్లబోవు వహ్ని! రెండు తేజఃపుంజములు సన్నిహితమైన విచిత్ర సన్నివేశమది. ఇతడడుగును. అతడు చెప్పును. భగవంతుడున్నాడా?, ఉన్నాడు; మీరు చూచితిరా? చూచితిని; ఎట్లుండును? నీవలెనుండును. నీలోనే ఉన్నాడు. నీవే భగవంతుడివి! అంతే; ఆ చైతన్యం ఇతణ్ణి స్పృశించింది! ఈ జడజీవితం పలికింది. నిర్వికల్ప సమాధిగతమై మేల్కొన్నది. ఆ దక్షిణేశ్వరముని శక్తిపాతప్రభ రగులుకొన్నది! ప్రజ్వలించినది! ఈ జాతికి, జగత్తుకు దివిటీ అయినది. రామకృష్ణ ధర్మరథానికెత్తిన విజయపతాక వివేకానందుడు!...కాదు, భారతీయ ధర్మరథానికెత్తిన విజయపతాక!

దక్షిణేశ్వరం నుండి వెలువడిన యీ శక్తిపాతప్రభ దేశం నాల్గు చెఱగులా తిరిగింది. శీతనగసింధు మధ్యస్థ సీమనంతా చుట్టివచ్చి కన్యాకుమారి చేరుకొన్నది. అక్కడ సముద్రగర్భంలో ఉన్న శిలపై కూర్చున్నది. చుట్టూ ఉల్లోల కల్లోలంగా ఉన్న సముద్ర ఘోషలు ! మధ్యలో బడబాగ్నివలె ఆసీనుడై ఉన్న ఈ కాషాయాంబరధారి. కన్యాకుమారి పాదాలచెంతనున్న యీ మహాపురుషుడు నగాధిరాజ శిఖరంపై వెలుగొందుచున్న పరమశివుణ్ణి చూస్తున్నాడు. ఆ విశాల నేత్రాంచలాలు ఈ మధ్యలోనున్న జీవకోటులను, నదులను, మైదానాలను, అరణ్యాలను, పర్వతాలను క్రమంగా స్పృశిస్తూ, దాటుకొంటూపోయి గౌరీ శంకర శిఖరంపై, పరమేశ్వరునిపై ప్రసరిస్తున్నవి. ఉన్నట్లుండి ఆ నేత్రాలు బాష్పపూరితాలైనయి. అవి మాతృవర్ష దివ్యసందర్శనానందంతో వర్షిస్తున్న హర్షబాష్పాలో, ఆమె దీనస్థితికి కుమిలిపోయిన గుండెలు కురుస్తున్న దుఃఖ బాష్పాలో ఇట్టే గుర్తింపవచ్చు. ఒకవైపు ఆధ్యాత్మికపరమైన పేదరికం, మఱొక వైపు ఆర్థికపరమైన పేదరికం నర్తిస్తూ నిర్వీర్యమై, నిస్తేజమైన ప్రజాజీవితం కళ్ళను కట్టింది. హృదయ మాక్రోశించింది.

కన్యాకుమారి శిలపై నుండి ఈ వివేకసింహం గర్జిస్తూ చికాగో నగరంలో ప్రపంచ సర్వమత మహాసభా వేదికపైకి దూకింది. ఇతణ్ణి యీ దేశం పంపలేదు. ఆ దేశం పిలువలేదు. తనకు తానై చేసిన లంఘన మది. ''స్వయమేవ మృగేంద్రతా'' అన్నమాట మన దేశం విషయంలో ఎంత నిజం ! ఆ వేదికపై సింహ సౌందర్యంతో వెలుగొందుతున్న ఆ కాషాయాంబరధారిని ఊహించి నప్పుడు భారతదేశమే నడచివెళ్ళిందా అనిపిస్తే ఆశ్చర్యమేముంది ! ఉన్నట్లుండి "ఓ అమెరికా సోదరీ సోదరులారా!'' అన్న మధురము, శాంతము, విశ్వమానవ సౌభ్రాతృ ప్రతిపాదకము అయిన భారతీయ ఋషివాక్యం ధ్వనించింది! పంచ భూతాలు స్తంభించి పులకరించినయి ! నింగీ నేలా తాళంవేసినట్లు హర్షధ్వానాలు మార్మోగినయి! అప్పుడాతడు చేసిన భారతీయ శుభధర్మగానంతో విశ్వగోళం చకితమైపోయింది!

ఆ వేదికనుండి బయలుదేఱిన ఆ ''సంక్షిప్త భారత స్వరూపం'', ఆ భారతీయ సంస్కృతీ తేజశ్చక్రం తారాజువ్వలా భూమండలమంతా చుట్టి వచ్చింది. మఱల కన్యాకుమారి అమ్మవారి పాదాల చెంతను చేరుకొన్నది! ఆ సింధు హిమగిరి పర్యంతం ఆ దివ్యదీపం తిరిగింది. ఆ కాషాయాంబరదీధితులు

భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి అరుణాంశురాగ రుచులైనయి. అప్పటి వఱకు నిస్తబ్ధంగా ఉన్న దేశం దిమ్మ తిరిగిపోయింది! ఆనందంలో తడిసి ముద్దయింది! ఎవరీ వివేకానందుడు! ఎవరీ నరేంద్రుడు! ఎవరీ వీరేశ్వరుడు! ఇదీ అప్పుడు చెలరేగిన చర్చ!

చికాగో వెళ్ళటానికి పూర్వం వివేకానందుడు పూనాలో తిలక్‌గారి యింట్లో ఒక వారం పదిరోజు లుండటం జరిగింది. అదొక గొప్ప సన్నివేశం. వివేకానందునకు తిలక్‌ను గూర్చి తెలుసు. అప్పటికే తిలక్ సుప్రసిద్ధుడు. వివేకుణ్ణి గూర్చి తిలక్‌గారికి ఏమీ తెలియదు. ఆ పది రోజుల్లోనూ ప్రతి రోజు కలుసుకుంటూ ఇద్దరూ ఏ వేదాంతచర్చలో చేసేవారే గాని ఒకరి పుట్టుపూర్వోత్తరాలను గూర్చి మఱొకరు అంతగా పట్టించుకొన్నది లేదు. చికాగోలో వివేకానందు డూదిన శంఖధ్వానం విన్న తరువాత తిలక్ విస్తుపోయారు. ఇతడా వివేకానందుడు! అనుకొన్నారు. ఆ తరువాత వీళ్ళిద్దరూ కలుసుకొన్న ఘట్టాలు ఎంత మధురమైనవి! తిలక్, రవీంద్రుడు, రామతీర్థ ఇలా ఎందరో మహా పురుషులు వివేకానందుని సమకాలికులు. పరస్పరం సన్నిహిత సంబంధాలున్న మహనీయులు. ఆ ఘట్టాలు, చదువుతూ ఉంటే ఈ జన్మకింకేం కావాలనిపిస్తుంది! అరవిందుడు, వివేకానందుడు కలుసుకొన్న సందర్భాలు గోచరింపవు. అరవిందుడు జైల్లో యోగసాధన చేస్తున్నప్పుడు తనను వివేకానందుడు పరిశీలిస్తున్నట్లు అనిపించేదట. అతని వాణి తనకు వినిపించేదట! తాను ప్రతిపాదించిన 'అతి మానస' సిద్ధాంతానికి స్ఫూర్తిదాత వివేకానందుడే నంటారు అరవిందులు. ఇంకా ఇలా అంటారు :

"Be hold, Vivekananda still lives in the soul of his mother - land and in the souls of her children"
ఎంత గొప్ప మాట యిది!

వివేకానందుని తల్లిపేరు భువనేశ్వరీదేవి. భువనములకు ఈశ్వరి యట! తండ్రి పేరు విశ్వనాథుడు. విశ్వములకు నాథుడట! తనపేరు నరేంద్రుడు, నరులకు ఇంద్రుడట! ఎంత అద్భుతమైన సమన్వయం! ఇక్కడే ఉన్నది ఆతని జీవనసంస్కారబల రహస్యం. అందుకే, విశ్వయోగి, విశ్వకవి కాగలిగాడు. ఈయన 1863 జనవరి 12 సోమవారం మకర సంక్రాంతినాడు జన్మించారు. 1902 జూలై 4 నాడు మహాసమాధిలోకి వెళ్ళారు. మొత్తం

38½ సంవత్సరాలు మాత్రమే జీవించారు. ఈ స్వల్పకాలంలో ఎంత చరిత్ర సృష్టించారు! జగద్గురు శంకరులు కూడ మరీ 32 సంవత్సరాలకే దేహం చాలించారు. శంకరుల అపరావతారమే వివేకానందులు.

బుద్ధుని కరుణాహృదయము, శంకరుల మేధాసంపత్తి వివేకానందునిలో రంగరించుకొన్నాయి. ఈ ముప్వురి చరిత్రను పరిశీలించిచూస్తే ఇంకా ఎన్నో లక్షణాలు బుద్ధునివి కొన్ని, శంకరులవి కొన్ని ఈతనిలో సమన్వయపడినట్లు కనుపిస్తాయి. భారతదేశ చరిత్రకు, సంస్కృతికి విశ్వజనీనతను సంతరించి పెట్టిన మహనీయులు ఈ ముగ్గురే. చిత్రమేమంటే ఈ ముగ్గురు కూడ చాల అందమైనవారు. భారతదేశంలో చాలా అందమైన సుప్రసిద్ధ మహాపురుషులెవరు అంటే యీ ముగ్గురే అని వెంటనే చెప్పవచ్చు. వీరిపేర్లు వినగానే ఒక తేజస్సు కండ్లముందు నడయాడుతుంది. ఇక తత్త్వానికి వస్తే బుద్ధుడు తన బోధనల ద్వారా ఈ జాతిని సమ్మోహితంచేస్తే శంకరులు సంజీవితం చేశారు. వివేకానందుడు ఈ రెండూ చేశాడు. అందుకే వివేకానందుణ్ణి గూర్చి ఆలోచించేటప్పుడు మన ఆలోచనల కూకటివ్రేళ్ళు బుద్ధుని దగ్గఱ తన్ని పెడతాయి. వివేకుడన్నాడు గదా; భారతదేశానికి రాబోవు 1500 సం॥ సరిపడే సిద్ధాంతాలను తాను ఇచ్చి పోతున్నాను అని. అంటే వివేకానందుని చరిత్రకు పూర్వరంగం బుద్ధుడుదాకా 2500 సం॥, ఉత్తరరంగం 1500 సం॥. మొత్తం 4 వేల సంవత్సరాల చరిత్ర కావాలన్నమాట. ఇట్టిది వివేకుని వ్యక్తిత్వం.

ఒక సందర్భంలో వివేకానందుడు తననుగూర్చి తాను "Condensed India" (సంక్షిప్తభారతము) అని ప్రకటించటం జరిగింది. ఇందులో అతిశయోక్తిలేదు. ఈ "సంక్షిప్త భారతము"ను గూర్చి బాగా అధ్యయనంచేస్తే భారతదేశం చక్కగా సాక్షాత్కరిస్తుంది. వాల్మీకి రామాయణంలో మొదట వంద శ్లోకాల సంక్షేప రామాయణ ముంటుంది (బాల రామాయణము). దీనికి పెంపుదలగా తరువాత 24 వేల శ్లోకాల రామాయణ మది. ముందు బాలరామాయణం చదివితే పిమ్మట పెద్దరామాయణం బాగా అర్థమౌతుందట. అలాగే వివేకానందుని జీవితచరిత్ర, అతని గ్రంథాలు పూర్తిగా చదివితే వేల సంవత్సరాల భారతదేశ చరిత్ర, సంస్కృతి, ధర్మం బాగా అర్థమౌతుంది. మహాపురుషుల జీవితచరిత్రయే దేశచరిత్ర అంటాడు వివేకానందు డొకచోట! ఒక్క వివేకానందుడు చాలు మనకు ఈ దేశం అర్థంగావటానికి. అన్ని విషయాలు చెప్పాడు వివేకుడు. "సంక్షిప్త భారతము" అన్నదాని పరమార్థ మాలోచించాలి.

వివేకానందుడు మన ప్రాచీన భారతాన్ని, వేల సంవత్సరాల ఆర్ష సంప్రదాయాన్ని, సంస్కృతిని, ధర్మాన్ని, ఆధ్యాత్మికతత్త్వాన్ని చెక్కుచెదఱకుండా వన్నెతరుగకుండా భద్రంగా మన కందించాడు. నా సిద్ధాంతమిది అంటూ క్రొత్త 'పంథా'ను ఏదీ లేవదీయలేదు. ఏ ప్రాచీన గ్రంథానికి నా ఉద్దేశ్యమిదీ అంటూ అన్వర్ధీకరించి భాష్యాలు వెలయించలేదు. దేనినిగాని ఖండించలేదు. దేనికిగాని మార్పులు, చేర్పులు, కూర్పులు, తీసివేతలు చెప్పలేదు. ప్రతి సమస్యకు పరిష్కారం మనదగ్గఱే ఉన్నది అని చెప్పాడు. ఈ జాతియొక్క ఆత్మను సరిగ్గా అర్థం చేసుకొన్న వ్యక్తి వివేకానందస్వామి.

సామాన్య ప్రజానీకాన్ని తట్టిలేపిన మొదటి మహనీయుడు ఈతడు. వారి కష్టాలకు, అజ్ఞానానికి, పరిష్కార మేమిటి అని వేదన పడిన మొదటి వ్యక్తి. ఆకలితో అలమటించే వాడికి మతం కాదు ముఖ్యం. తిండి, బట్ట అని యెలుగెత్తి చాటిన ఉద్దండుడు.

"నా దేశమున నొక్క కుక్క యైనను పస్తుపడియున్నంత వఱకు దానికాహారమిడి రక్షించుటయే నా పరమ ధర్మము, ఇదియే నా మతము, తద్భిన్న మంతయు నధర్మము కృత్రిమ ధర్మము."

సమస్త జీవ స్వరూపుని, అద్వితీయుని ... విశేషము ... నా యార్త నారాయణుని, నాదీన నారాయణుని... సమస్త దేశీయులకెల్ల పేదయగు నాభారత నారాయణుని, నా యిష్ట దేవత నర్చించుటకై యెన్ని జన్మములైనను ఎత్తెదను గాక, ఎన్ని వేల బాధలనైననూ అనుభవింతును గాక !!

భారత దేశమును తెలిసికొనుట యనగా ఒక వైపు ఆధ్యాత్మిక తత్త్వమును మఱియొక వైపు సామాన్య ప్రజా హృదయమును తెలిసికొనుట అని వివేకానందుని ఉద్దేశ్యము,

తల గుడ్డ హిమకిరీటము గాను నడుముకు బిగించిన కట్టు వింధ్యగిరిగను నిలువునా జీరాడు అంగరఖాతో కూడిన చీలమండలము కన్యాకుమార్యగ్రము గాను కాన్పించు వివేకుడు భారతాద్వైతమూర్తి. "సంక్షిప్త భారతము". ఆతడు సెలవిచ్చిన యీ రెండు సందేశములు మనకు శిరోధార్యము:

"Even after death I shall work for the good of the world there is no rest for my soul till man becomes one with God".

"Every Indian must know from his very birth that his life is dedicated to his mother land".

## విశ్వకవి వివేకానంద

స్వామీ వివేకానందను గూర్చి భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి వేగుచుక్కగా, సంక్షిప్త భారతస్వరూపుడుగా, భారతాద్వైతమూర్తిగా, వేదాంతిగా, విశ్వయోగిగా, మానవతావాదిగా, దేశభక్తుడుగా, ఆబాలగోపాలం ప్రజలందఱకూ బాగా తెలుసు. కాని ఆయన గొప్ప కవి అన్న విషయం చాలా మందికి తెలియదు. దీనికి కారణం మనమాయనను అసలా దృష్టితో చూడక పోవటమే. కొంతమంది మహనీయుల్ని గూర్చి వారు ఏ రంగంలో ప్రఖ్యాతి వహించారో ఆ రంగానికే పరిమితం చేసి ఎంతసేపూ ఆ దృష్టితోనే చూడటం మన కలవాటు. ఇది మానవ నైజం. జగద్గురు శ్రీ శంకరుల విషయం కూడా ఇంతే. వారు ''సౌందర్య లహరి'', ''శివానందలహరి'' వంటి రసపరీవాహము లైన స్తోత్ర కావ్యాలెన్నో వ్రాశారు. ఆయన అగ్రశేణికి చెందిన మహాకవి. కాని వారిని మనమా దృష్టితో చూడము. ఇదొక విచిత్రమైన మహా విషయం. ఆ వరుసలో వివేకానందులు కూడ గొప్ప కవి. వారు ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, సంస్కృత భాషల్లో మహాకవిత్వాన్ని వెలయించారు. ఆయా భాషల్లో వారు వ్రాసిన కవితల సంఖ్య రాశిలో తక్కువే అయినా గుణంలో గరీయమైనవి. ఏ భాష కాభాషగా, అందులో వ్రాసిన కవితల్ని విడివిడిగా పరిశీలిస్తే ఆ భాషా స్వభావాన్నిబట్టిగాని, ప్రతిపాదింపదలచిన విషయ భేదాన్నిబట్టిగాని భావధోరణిలో సూక్ష్మమైన భేదమున్నప్పటికి, విశ్వమానవతా దృక్పథము, జాతీయ భావన, ఆధ్యాత్మికచింతన అన్నవి యీతని అన్ని కవితల్లోనూ కనుపించే సామాన్య లక్షణాలు. ప్రస్తుతం ఇక్కడ వారి సంస్కృత కవిత్వాన్ని గూర్చి, ఆంగ్ల కవిత్వాన్ని గూర్చి మాత్రమే ప్రసంగించటం జరుగుతున్నది.

## సంస్కృత కవిత

విశ్వజనీనమైన భారతీయ సంస్కృతికి సంస్కృత భాష మూలకందమని, దీన్ని భారతీయులందరూ విధిగా అభ్యసించాలని వారి నిష్కర్ష. తాను బాల్యం నుండీ యీ భాషను అభ్యసించి, అందలి గ్రంథజాలాన్నంతా క్షుణ్ణంగా అధ్యయనం చేసి, తన మేథామంథువుతో అందలి జీవసారాన్ని పీల్చుకొని ప్రాచీన నవీనయుగ సాధుగుణ సమన్వయంతో ఒక సమగ్రమైన జాతీయ జీవన దర్శనాన్ని ప్రతిపాదించిన తత్త్వవేత్త వివేకానందుడు. వారి ఉపన్యాసాల సంపుటములన్నిటినీ పరిశీలిస్తే సంస్కృత గ్రంథాల నుండి వారు ఉదాహరించిన

శ్లోకాలు వందల సంఖ్యలో దర్శనమిస్తాయి. ఆ శ్లోకాలను ఆధారం చేసుకొని వారు తమ భావధారను ఎన్ని రకాలుగా మెలికలు త్రిప్పుతూ తేనెలు సాగించారో గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. సంస్కృత వాఙ్మయంలో నిక్షిప్తమైన జ్ఞాన మంతా దేశ భాషలద్వారా జన సామాన్యానికి అందాలని వారు చెప్పిన మొదటి మాట. ఆ అందిన జ్ఞాన సంపదకు మంచి తేజస్సు. ఓజస్సు, సంస్కారము అబ్బటానికి సంస్కృత భాషాధ్యయనం అవసరమని వారు చెప్పిన రెండవ మాట. ఆ భాషను అభ్యసించటం జనసామాన్యానికి కష్టం కావచ్చు. కాని చదువుకొన్న వారి సంఖ్య ఎంత ఎక్కువగా ఉంటే ఈ జాతికి అంత శ్రేయస్సు కలుగుతుందని, ఆ భాషా విద్వాంసుల సంఖ్య పెరుగుతూ ఉండాలనీ, అందు కోసం ఆ విద్యా ప్రచారం నిరంతరంగా జరుగుతూ ఉండాలనీ వారు చెప్పిన మూడవ మాట. ఇలా మెట్లు మెట్లుగా సంస్కృతాన్ని గూర్చి ఆయన వెలి బుచ్చిన అభిప్రాయాలు చాలా స్ఫూర్తిదాయకంగా ఉంటాయి. ఆయన ఏ కొంచెం తీరిక చిక్కినా సంస్కృత గ్రంథాలను చదువుతూ వాటిని గూర్చి శిష్యులతో చర్చిస్తూ ఉండేవారు. ప్రవాహంగా సంస్కృతంలో మాట్లాడుతూ ఉండేవారు. 1898 నవంబరులో జరిగిన ఒక సంఘటనను గూర్చి వారి శిష్యుడు శరచ్చంద్ర చక్రవర్తి చెప్పిన విషయమిది ;

Swamijee now much engaged in the study and discussion of Sanskrit seriptures......on this day it seemed as if the Goddess of learning has manifested herself on his tongue with the disciple, he fluently talked for about two hours at a stretch in exceedingly melodious sanskrit.......... (complete works Vol. VII PP. 132-33)

ఈ చివరి వాక్యం Melodious Sanskrit అన్నది చదివినప్పుడు ఆ కంఠంలో ఆ భాషా మాధుర్యం ఎంత శ్రుతి సుభగంగా ఉండేదో అన్న ఊహ జనించి హృదయం పులకరిస్తుంది. ఈ విధంగా నిరంతరం సంస్కృత భాషా వ్యాసంగం చేయుటయే గాక ఆ భాషలో గొప్ప కవితా సంపదను కూడ వెలయించి మనకు ప్రసాదించిన మహనీయుడాయన. వారు వ్రాసిన కవితల సంఖ్య యిప్పటికి లభించినవి 26 శ్లోకాలు మాత్రమే. ఇవి "అంబాస్తోత్రమ్"

''శివస్తోత్రమ్'', ''Whom to fear'', ''Hymns to Sri Rama krishna,'', ''Salutation to Sri Rama krishna'' అను శీర్షికల క్రింద పొందుపఱచబడినవి :

"అంబా స్తోత్రమ్" ఇందులో ఏడు శ్లోకాలున్నాయి. వీని రచనా కాలము తెలియటం లేదు. సర్వమత మహాసభలో పాల్గొనటానికి చికాగో వెళ్ళుటకు కొంత ముందు కన్యాకుమారి శిలపై ధ్యాన నిమగ్నుడై కూర్చొని అనిర్వాచ్యమగు ఒకానొక ప్రేరణలో వ్రాసి యుండవచ్చునని భావింపవచ్చును.

''శివస్తోత్రమ్'' ఇందులో ఆరు శ్లోకాలున్నాయి, వీని రచనా కాలం కూడా తెలియుట లేదు. అంబా స్తోత్రమైన పిమ్మట వెంటనే కాని, ఎప్పుడో తరువాత గాని గావచ్చును.

"Whom to fear?" ఇందులో నాల్గు శ్లోకాలున్నాయి. ఇవి తనతోటి శిష్యులకు వివేకుడు వ్రాసిన లేఖలో పొందుపఱుపబడి ఉన్నవి. ఈ లేఖ 25 సెప్టెంబర్ 1894 నాడు వ్రాయబడింది.

"Hymns to Sri Rama Krishna" (రామకృష్ణ స్తోత్రమ్), ఇందులో మొత్తం ఎనిమిది శ్లోకాలున్నాయి. ఇవి 1898 నవంబర్‌లో బేలూరు నందు వ్రాయబడినవి.

"Salutation to Sri Rama Krishna" ఇది ఒకే ఒక శ్లోకము. 1878 ఫిబ్రవరిలో హౌరా యందలి నవగోపాల్ ఘోష్ అను రామకృష్ణుని శిష్యుని యింట్లో పూజా మందిరంలో అప్రయత్నంగా వివేకానందుని నోటినుండి వెలువడినదట.

ఈ 26 శ్లోకములకు ప్రతిపదార్థ తాత్పర్య విశేషాంశములతో వ్యాఖ్య వ్రాయుట ఇప్పటి ఒక అంశము.

## ఆంగ్ల కవిత

ఆంగ్లేయులు మన దేశాన్ని దాదాపు 200 ఏండ్లు పాలించారు. మన దేశంలో ఇంగ్లీషు విద్యా విధానాన్ని ప్రవేశపెట్టి భారతీయుల్ని ఆంగ్లభాషా వ్యామోహితుల్ని చేయటానికి విశ్వప్రయత్నం చేశారు. వారు పాలించిన రెండు వందల ఏండ్లలో చివరి వంద సంవత్సరాలలో ఇంగ్లీషు భాషారాజ్యమే రాజ్యమని చెప్పవచ్చు అయినా ఆ భాషలో అద్భుతమైన పాండిత్యాన్ని గడించి రచయితలు

సుప్రసిద్ధులైన వారు చాలా తక్కువ. కేవలం కవులుగా చెప్పదగిన వారిని ఒక చేతివ్రేళ్ళమీద మాత్రమే లెక్కపెట్టవచ్చు. మనకు వెంటనే జ్ఞాపకం వచ్చేది రవీంద్రుడు, సరోజనీనాయుడు మాత్రమే. కొంచెం ఆలోచిస్తే తోరుదత్తు జ్ఞాపకం వస్తుంది. ఇంకా బాగా ఆలోచిస్తేగాని జ్ఞాపకం రానివాడు, మైకేల్ మధుసూదనదత్తు. చిత్రమేమంటే ఈ మధుసూదన్‌దత్తు ఆంగ్ల కవిగా తన కీర్తి విశ్వవ్యాప్తమవుతుందని కలలుగన్న వ్యక్తి. భారతీయుడైన మొదటి ఇంగ్లీషు భాషా కవి యెవరు అన్నప్పుడు ఆంగ్ల విద్యావిశారదులు ఈ మధుసూదన్ దత్తును, ఇంకా అనామకుల్ని ఇద్దర్ని చూపిస్తుంటారు. ఇవాళ ఆ మధుసూదన్ దత్తు పేరు సోదిలోలేదు. చిన్న చిన్న వాళ్ళను ప్రక్కకు తొలగిస్తే ప్రధానంగా మిగిలేది ఇద్దరే, రవీంద్రుడు, సరోజనీనాయుడు మాత్రమే. రవీంద్రుడు కూడా తొలుత బెంగాలీ భాషలో ఊహించి బెంగాలీలో వ్రాసి, తరువాత ఇంగ్లీషులోకి అనువదించి ఆంగ్లకవిగా సుప్రసిద్ధుడైన వ్యక్తి మాత్రమే. ఆతనిని విశ్వకవిగా చేసిన గీతాంజలి విషయమంతేనని చరిత్ర ఋజువుచేస్తున్నది. ఇంగ్లీషులో ఊహించి ఇంగ్లీషులో వ్రాసిన కవయిత్రి సరోజినీదేవి మాత్రమే. కాల సరణిని బట్టి మైకేల్ మధుసూదన్ దత్తు. (1842 ప్రాంతం) మొదటి కవియని చెప్పవచ్చునేమోగాని ఆతనికి గల అనామకత్వాన్నిబట్టి తొలిగిస్తే. వివేకానందుడు ఇంగ్లీషులో కవిత్వం వ్రాసిన తొలి భారతీయుడు అని చెప్పవచ్చు.

వివేకానందుడు కవిగా సుప్రసిద్ధుడు కాకపోవచ్చు. కాని ఆంగ్లభాషా విశారదుడుగా ఆంగ్లభాషలో ఆంగ్లేయుల్నే ఉఱ్ఱూతలూగించిన మహావక్తగా అతనిని మించినవారు లేరన్నచో అతిశయోక్తికాదు. వివేకానందునికి గల ప్రసిద్ధిని బట్టియు, ఇంగ్లీషు భాషా మహాప్రవాహంలో గజయీతగాడుగా ఆతనికి లభించిన కీర్తిని బట్టియు, ఇంగ్లీషు భాషలోనే ఊహించి ఇంగ్లీషులో వెలయించిన గొప్ప కవితా సంపదనుబట్టియు భారతీయుడైన తొలి ఆంగ్లకవి వివేకానందుడు అని నిష్కర్ష చేయవచ్చును. మఱొక ముఖ్య విషయమును గూడ మనము గమనింపవలసియున్నది. వివేకానందుడు 1893-1902 మధ్యకాలంలో అమెరికా ఖండమునందును, ఇంగ్లండు మొదలైన యూరోపుఖండ దేశములందును భారతీయ సంస్కృతిని గూర్చియు, ఆధ్యాత్మికతత్త్వమును గూర్చియు నిర్మించిన వాతావరణ ప్రభావమువల్లనే రవీంద్రునకు 1913 లో నోబెల్ బహుమతి లభించి విశ్వకవి యైనాడని భావింపవలెను. రవీంద్రుడు మొదట బెంగాలీలో వ్రాసిన

గీతాంజలిని 1905 ప్రాంతమున ఆంగ్లమున ననువదించెను. వివేకానందుడు నిర్మించిన వాతావరణముయొక్క వేడిలో నాతడు ఇంగ్లీషు గీతాంజలిని వ్రాయుటయు, సహజముగ సత్యంత ప్రతిభాశాలియైన మహాకవి యగుటయు కారణముగ నాతనికి ఈ యదృష్టము లభించినది. భారతీయుల యదృష్టము పండినది. వివేకానందుడు విశ్వయోగి, విశ్వకవి. రవీంద్రుడు విశ్వకవి. 1881 లో వివేకుడు 26 సం॥ వయస్సులో నున్నప్పుడు రవీంద్ర వివేకానందుల సమావేశం జరుగుట అద్భుత సన్నివేశం. అప్పుడు రవీంద్రుడు తాను వ్రాసిన పాటకు ట్యూన్‌కట్టి, వివేకునకు నేర్పి ఒక వివాహ సభలో పాడించటం జరిగింది.

వివేకానందుని ఆంగ్ల రచనలను మూడు తఱగతులుగా విభజింపవచ్చును. ఒకటి– ఉపన్యాసములు. రెండు-లేఖావళి. మూడు-కవితా ఖండికలు. ఆతని కవితా ఖండికలను రెండు తెఱగులుగా విభజింప వచ్చును. ఒకటి- Original Poems. రెండు- Translations. ఇవి వారు సంస్కృత వాఙ్మయము నుండి కొన్నింటిని ఏరుకొని అనువదించిన ఖండికలు. వివేకానందుని Prose అంతయు Poetry వలె నుండునను విషయము మఱువరాదు. వారి ఆంగ్ల కవితా ఖండములను గూర్చి దిఙ్మాత్రముగ పరామర్శించుట రెండవ యంశము.

## యువభారతికి కృతజ్ఞతలు

1983 ఫిబ్రవరి నెలలో 16-22 తేదీలలో హైదరాబాదు నల్లకుంటలోని శంకరమఠంలో శంకరమఠం యాజమాన్యం వారి ఆహ్వానముపై వరుసగా ఏడు రోజులు ఆధ్యాత్మికోపన్యాసములు గావించితిని. ఆ సందర్భమున చివరి నాలుగు రోజులు స్వామీ వివేకానందుని సంస్కృత కవిత్వమును గూర్చి ప్రసంగించితిని, అప్పుడు ఒక రోజు యువభారతి అధ్యక్షులు శ్రీయుతులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు నా ఉపన్యాసమును వినుట తటస్థించినది. అది కాకతాళీయముగ జరిగిన సంఘటన, వారి ప్రేరణతో ఈ 'వివేకానంద' కవితా వైభవము"ను వ్రాయు నవకాశము నాకు లభించినది. నాకీ యవకాశమును కలుగజేసిన శ్రీకృష్ణమూర్తిగారికి, యువభారతికి ధన్యవాదములు.

# వివేకానంద కవితావైభవము

## సంస్కృత కవిత

### అంబాస్తోత్రమ్

శ్లో. కా త్వం శుభే శివకరే సుఖదుఃఖహస్తే
ఆఘూర్ణితం భవజలం ప్రబలోర్మి భజ్గైః
శాంతిం విధాతు మిహ కిం బహుధావిభగ్నామ్
మాతః ప్రయత్న పరమాసి సదైవవిశ్వే.

టీక—శుభే = శోభనస్వరూపురాలా, శివకరే = మంగళములనిచ్చుదానా, సుఖదుఃఖహస్తే = సుఖదుఃఖములను హస్తములందుంచుకొన్నదానా, మాతః = ఓ తల్లీ, త్వం = నీవు, కా = ఎవరివమ్మా, భవజలం = ఈ సంసార సాగరము, ప్రబలోర్మిభజ్గైః-ప్రబల = ప్రబలములైన,ఊర్మిభజ్గైః = తరంగభంగములచేత, అఘూర్ణితం = కలగుండు పడిపోవుచున్నది, ఇహ = ఈ, విశ్వే = ప్రపంచమున, బహుధా = అనేక విధముల, విభగ్నమైపోయిన, శాంతిం = శాంతిని, విధాతుం = తిరిగి నెలకొల్పుటకు, సదా ఏవ = నిరంతరము, ప్రయత్న పరమా = ప్రయత్నపరురాలవు, అసి కిం = అగుచుంటివా, తల్లీ!

తాత్పర్యము :- హే భగవతి! ఎవరివమ్మా నీవు? ఓ సౌందర్యరాశీ! ఓ మంగళమయీ! సుఖదుఃఖములను పవిత్రమైన చేతులయందుంచుకొన్నదానవు! ఎవరివమ్మా నీవు? ఈ సంసార సాగరము ప్రబలములై ఉత్తాలములైన తరంగ భంగములచే ఎలా కలగుండు పడిపోతున్నదో చూడు. పలు విధముల భగ్నమై పోయిన ప్రపంచశాంతిని తిరిగి నెలకొల్పుటకు నిరంతరము ప్రయత్నించుచున్న జగజ్జననివా॥

అలంకారము :- భవజలం-సంసారమనెడు సాగరము అనుచోట రూపకము, సాగరము తరంగ భంగములచే కలగుండుపడును. మఱి సంసారము దేని చేత కలగుండుపడును? కష్టములచేత, అశాంతిచేత అని యర్థము- ఆ విషయ మిట చెప్పకపోయినను అతి సహజముగ సూచింపవచ్చును.

విశేషము :- ఇది కొంతవఱకు ఆనాటి దేశ పరిస్థితులను సూచించుచున్న శ్లోకమని భావింపవచ్చును. ఎక్కడ చూచినను పేదరికము తాండవించుచుండెను. ప్రజలు తిండికి వాచిపోయిరి. "నా దేశమున నొక కుక్కయైనను పస్తుపడి యున్నంతవఱకు దాని కాహారమిడి రక్షించుటయే నా పరమధర్మము. ఇదియే నా మతము. తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమ ధర్మము" అని వివేకానందుడాక్రోశించినాడన్నచో నాటి పరిస్థితి నూహింపవచ్చును. మేధావంతులు పాశ్చాత్య సంస్కృతీ వ్యామోహితులైరి. ఆధ్యాత్మిక దృష్టి సన్నగిల్లినది. జాతి ఆత్మవిస్మృతిలోబడినది. ఇక ఐర్లాండు ప్రజలు తమ దేశమున తిండిలేక చింకి బట్టలతో పొట్టచేతబట్టుకొని అమెరికాకు వలసపోవుట కన్నులార గాంచిన వాడు వివేకానందుడు. ఇంచుమించు ఇదే సమయమున రుషియాతో తెల్లవారికి యుద్ధము వచ్చు సూచనలు కన్పించుచుండెను. ఇట్లెన్నియో విషయముల నూహింపవచ్చును. మొత్తము మీద శాంతికొఱవడిన కాలమది.

శ్లో. సంపాద త్యవిరతం త్వవిరామవృత్తా
యా వై స్థితా కృతఫలం త్వకృతస్య నేత్రీ
సా మే భవత్వనుదినం వరదా భవానీ
జానామ్యహం ధ్రువమిదం ధృతకర్మపాశా.

టీక–యా = ఏ తల్లి, అవిరామవృత్తా = విరామములేని క్రియావ్యాపారములు గలదై, అవిరతం = నిరంతరము, కృతఫలం = ఇప్పటికి చేసిన కర్మల యొక్క ఫలమును, సంపాదయతి = సమకూర్చుచున్నదో, అకృతస్య, తు = ఇప్పటికింకనూ చేయబడని కర్మలకు (ఇకముందు చేయబోవు కర్మలకు) నేత్రీ = మార్గదర్శకురాలై, స్థితా = ఉన్నదో, సా = ఆ తల్లి, మే = నాకు, అనుదినం = ప్రతినిత్యము, వరదా = వరములను ప్రసాదించునదిగా, భవతు = అగుగాక, భవానీ = ఆ జగజ్జనని, ధృతకర్మపాశా = తన హస్తములందుంచుకొన్న కర్మపాశములు గలది, ఇదం = ఈ విషయమును, అహం = నేను, ధ్రువం = నిశ్చయముగా, జానామి = ఎఱుగుదును.

తాత్పర్యము : జగజ్జననియగు నామెకు విశ్రాంతి యన్నదిలేదు. మానవులు చేసిన కర్మఫలములను ఎప్పటికప్పుడు సమకూర్చి పెట్టుచునే యుండును. ఇకముందు చేయబోవు కర్మములకు మార్గదర్శకురాలై యుండును. అట్టి యా భగవతి నాకు నిరంతరము వరములను ప్రసాదించుచుండుగాక. కర్మ

పాశములన్నియు ఆ తల్లియధీనమునందుండునన్న విషయమును నిక్కముగా నేనెఱుగుదును.

శ్లో. కో వా ధర్మః కిమకృతం కః కపాలలేఖః
కిం వా దృష్టం ఫలమిహాస్తి హి యాం వినా భోః
ఇచ్ఛాపాశై ర్నియమితా నియమాః స్వతంత్రైః
యస్యా నేత్రీ భవతు సా శరణం మమాద్య.

టీక—భోః = అయ్యా, యాం వినా = ఏ తల్లిలేక, ఇహ = ఈ లోకమున, కో వా ధర్మః = ఏ ధర్మము, అస్తి = ఉన్నది?, అకృతం = సృష్టింపబడనిది, కిం అస్తి = ఏమున్నది, కః కపాలలేఖః = ఏ నొసటివ్రాత, అస్తి = ఉన్నది, కిం వా అదృష్టఫలము = ఏ అదృష్టఫలము, అస్తి = ఉన్నది, యస్యాః = ఏ తల్లియొక్క, స్వతంత్రైః = స్వతంత్రములైన, ఇచ్ఛాపాశైః = ఇచ్ఛాపాశములచేత, నియమాః = నియమములన్నియు, నియమితాః = నియంత్రితములై యున్నవో, సా = ఆ తల్లియే, అద్య = నేడు, మమ = నాకు, నేత్రీ = మార్గదర్శకురాలు, భవతు = అగుగాక, శరణం = శరణము, భవతు = అగుగాక. (ఈ శ్లోకమున కవి అస్తి, భవతు, అను క్రియాపదములను ఒక్కొక్కమాఱే ప్రయోగించెను. టీకయందు స్పష్టప్రతిపత్తికై పలుమార్లు వాడబడినదని గమనింపవలెను.)

తాత్పర్యము: నాయనలారా! జగజ్జనని యగు నామెలేనిచో ఈ ప్రపంచమున నేదియు లేదని గ్రహింపుడు. ఆ తల్లి లేక ఏ ధర్ముముండును ? సృష్టింపబడునది, సృష్టింపబడనిది యన్నదేముండును ? నొసటన్ వ్రాసిన వ్రాత యెక్కడిది? అదృష్టము పండునను మాటకు తావెక్కడిది? ఈ జగత్తు యొక్క వ్యాపారములన్నియు ఆమె యెఱుకతోనే ప్రవర్తిల్లుచున్నవి. ఈ ప్రకృతి నియమములన్నియు ఆ భగవతి యొక్క స్వతంత్రములైన ఇచ్ఛాపాశములచే కట్టుబడి యున్నవి. అట్టి సర్వశక్తిమంతురాలైన ఆ 'పరాశక్తియే నేడు నాకు మార్గ దర్శకురాలు, శరణము అగుగాక.

శ్లో. సంతాన యంతి జలధిం జనిమృత్యు జాలం
సంభావయంత్య వికృతం వికృతం విభగ్నమ్
యస్యాస్సి ఘాతయ ఇహామిత శక్తిపాలాః
నాన్యత్ర తాం పద మతః శరణం ప్రజామః.

2)

టీక- యస్యాః = ఏ జగన్మాత యొక్క, అమిత శక్తిపాలాః = మిక్కిలి శక్తి సంపన్నములైన, విభూతయః = లీలా విలాసములు, జనిమృత్యు జాలం - జని = పుట్టుకల యొక్క, మృత్యు = చావుల యొక్క, జాలం = తంపర అనెడు, జలధిం = సముద్రమును, సంతానయంతి = వృద్ధి పొందించు చున్నవో, అవికృతం = అందమైన దానిని, వికృతం = వికారముగాను, విభగ్నం = విభగ్నమైన దానిని గాను, (అట్లే) వికృతం = వికారమైనదానిని, అవికృతం = అందమైనదానిని గాను, విభగ్నం = విభగ్నమైనదానిని, అవికృతం = విభగ్నము కాని దానిని గాను, సంభావయంతి = సంభవములగు నట్లు చేయుచున్నవో, తాం = ఆ జగన్మాతను, న ఆశ్రిత్య- ఆశ్రయింపక, కుతః = మఱి దేని వలన, శరణం = దిక్కును, వ్రజామః = పొందెదమో, వద = చెప్పుము. (ఇందలి అవికృతం, వికృతం, విభగ్నం - అను మాటలను అటు దిటు. ఇటుదటు త్రిప్పి యర్థము చెప్పి కొనవలెను. అప్పుడే కవి యొక్క ప్రతిపాదన చక్కగా బోధపడును).

తాత్పర్యము : ఆ జగన్మాత యొక్క లీలా విలాస విన్యాసములు అత్యంత శక్తి సంపన్నములైనవి. అటు జన్మయనెడు సముద్రమును వృద్ధి చెందించుచుండును. ఇటు మరణమను సముద్రమును వృద్ధి చేయుచుండును. అనగా ఇష్టము వచ్చినట్లు జననముల సంఖ్యను పెంచుచుండును. తగ్గించుచుండును. అట్లే మరణముల సంఖ్యను పెంచుచుండును తగ్గించుచుండును. అందమైన వ్యక్తులను గాని, వస్తువులనుగాని అంద వికారముగ చేయుచుండును. నాశనము కూడ చేయుచుండును. అట్లే అందవిహీనమైన మానవులను గాని వస్తువులనుగాని, అందముగా రూపొందించుచుండును, పాడు చేయబడిన వాటిని బాగు చేయుచుండును. అట్టి సర్వశక్తి మంతురాలైన ఆ తల్లి నుండి గాక మఱెవ్వరి వలన మనకు శరణము లభించును? చెప్పుము సుమా !

అలంకారము– జనిమృత్యుజాలం జలధిం-అనుచోట రూపకము.

శక్తిపాలాః-అన్న ప్రయోగము శబ్దవైచిత్రికి తార్కాణ.

శ్లో. మిత్రే శత్రౌ త్వవిషమం తవ పద్మనేత్రం
స్వస్థే దుస్థే త్వవితథం తవ హస్తపాతః
మృత్యుచ్ఛాయా తవ దయా త్వమృతం చ మాతః
మా మాం ముంచంతు పరమే శుభదృష్టయస్తే.

టీక:- పరమే=పరాశక్తివైన, మాతః=ఓ తల్లీ, తవ=నీయొక్క, పద్మనేత్రం=పద్మమువంటి నేత్రము, మిత్రే=మిత్రుని యందును, శత్రౌ=శత్రువునందును (నీ భక్తుని యందును. భక్తుడు కాని వానియందును అని యర్థము), అవిషమంతు=సమముగానే ప్రసరించును గదా! తవ=నీయొక్క, హస్తపాతః=హస్తస్పర్శ. స్వస్థే=అదృష్టవంతుని యందును, దుఃస్థే=దురదృష్టవంతుని యందును, అవితథం తు=వట్టిపోక, ఒకే తీరుగ పని చేయును గదా! మృత్యుచ్ఛాయా=మృత్యువు ఆవరించుట గాని, అమృతంచ=అమరత్వము పొందుటగాని, తవ=నీయొక్క, దయా, తు=దయాఫలితమే గదా!, తే=నీయొక్క, శుభదృష్టయః=మంగళమయమైన చూపులు, మాం=నన్ను, మా ముంచంతు=విడువకుండు గాక.

తాత్పర్యము :- హే పరాశక్తీ! నీ కరుణా కటాక్షవీక్షణములు నీ భక్తులయందును, కాని వారలయందును-అందరూ నీ బిడ్డలే యగుటవలన-ఒకే విధముగా ప్రసరించుచుండును తల్లీ! నీ హస్త స్పర్శ అదృష్టవంతులయందును, దురదృష్టవంతుల యందును వ్యర్థము కాదమ్మా! ప్రాణికోటికి సంభవించు అకాల మరణము గాని, కాలమృత్యువుగాని, చిరంజీవిత్వము గాని, నీ దయపై ఆధారపడియుండునే గదా! నీ బిడ్డడినగు నానుండి మాత్రము నీ పావన దృక్కులు ఎన్నడూ తొలగిపోకుండు గాక.

అలంకారము :- మిత్రే శత్రౌ, స్వస్థే, దుస్థే, మా మాం ముంచంతు,- ఈ మూడుచోటులందు వృత్త్యనుప్రాసములు.

ఈ వృత్త్యనుప్రాసలతో బాటు మొదటిపాదమందలి "అవిషమం" రెండవ పాదమందలి "అవితథం" అను ప్రయోగములు శ్లోకముయొక్క గతి స్ఫురణమును ద్విగుణీకృత మొనర్చుచున్నవి. చక్కని రచనాశిల్పము గల శ్లోకమిది.

శ్లో. క్వాంబా సర్వా క్వగృణనం మమ హీనబుద్ధేః
ధర్తుం దోర్భ్యామివ మతిర్జగదేక ధాత్రీమ్
శ్రీసఞ్చిత్యం సుచరణం అభయప్రతిష్ఠమ్
సేవాసారై రభినుతం శరణం ప్రపద్యే.

టీక :- సర్వా=సర్వము తానె అయిన, అంబా=ఆ తల్లి, క్వ=ఎక్కడ, హీనబుద్ధేః=మందబుద్ధినైన, మమ=నాయొక్క, గృణనం=స్తుతి, క్వ=ఎక్కడ, జగదేకధాత్రీం=సర్వ జగత్తుకు ఏకైక ఆధారభూతు

రాలగు ఆమెను, దోర్భ్యాం = ఈ నా రెండు చేతులతో, ధర్తుం ఇవ = చిక్కించుకొనవలయునను, మతిః = బుద్ధి పుట్టుచున్నది, శ్రీ సంచిత్యం = శ్రీదేవి చేతనే యారాధింపబడుచున్నట్టిదియు, అభయ ప్రతిష్ఠం = అభయ మునకు తావలమైనదియు, సేవాసారైః = అర్ఘ్య పాద్యాది సేవా సారముల చేత, అభినుతం = స్తుతింపబడునదియునైన, సుచరణం = పవిత్రమైన పాదమును, శరణం = శరణమును, ప్రపద్యే = చొచ్చెదను.

తాత్పర్యము : సర్వాత్మరాలైన ఆ జగదంబ ఎక్కడ ? మంద బుద్ధి నగునా చేయు స్తుతి యెక్కడ ! జగత్తున కంతటికీ ఏకమాత్ర ఆధార భూతురా లగు ఆ తల్లిని నాచేత చిక్కించుకొనవలయునను బుద్ధి వొడముచున్నదే ! సాక్షాత్తు శ్రీదేవి చేతనే ధ్యానింపబడుచు, అభయమునకు తావలమైన, అర్ఘ్య పాద్యాది సేవా సారములచే నుతింపబడుచున్న ఆ తల్లియొక్క దివ్య చరణమునే శరణు జొచ్చెద గాక.

ఈ శ్లోకము నందలి మొదటి రెండు పాదములు కాళిదాసుని రఘు వంశావతారికలోని యీ శ్లోకమును స్ఫురణకు తెచ్చుచున్నవి :

శ్లో. క్వ సూర్య ప్రభవో వంశః క్వచాల్ప విషయా మతిః
తితీర్షు ర్దుస్తరం మోహాదుడు పేనాస్మి సాగరమ్.

సూర్యవంశ మెక్కడ! అల్పబుద్ధి నగునే నెక్కడ! దాటుటకు సాధ్యము కాని సాగరమును. చిన్న తెప్పతో దాటుటకు కుతూహల పడుచున్నాను. సూర్య వంశ రాజుల చరిత్రను వ్రాయగల సామర్థ్యము తనకు లేదని చెప్పుట సారాంశము.

చివరి రెండు పాదములు శ్రీ శంకరాచార్య కృత సౌందర్య లహరిలోని నాల్గవ శ్లోకము నందలి చివరి రెండు పాదములను గుర్తుకు తెచ్చుచున్నవి: పాఠకుల సౌకర్యము కొఱకు ఆ మొత్తము శ్లోక మీయబడుచున్నది :

శ్లో. త్వదన్యః పాణిభ్యా మభయ వరదో దైవతగణః
త్వమేకా నైవాసి ప్రకటిత వరాభిత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫల మపి చ వాంఛా సమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణా వేవ నిపుణౌ. (4)

ఇందలి చివరి రెండు పాదముల సారాంశమిది :

భయమును పోగొట్టుటకు గాని, అడిగిన దానికంటె నధిక ఫలము నిచ్చుటకు గాని, ఓతల్లీ ! నిపుణములగు నీ చరణములే లోకములకు శర ణ్యములు.

ఇందలి భావ ముద్రను, శ్లోకము యొక్క కట్టుబడిని వివేకానందుడు పుణికి పుచ్చుకొన్నట్లు భావింప వచ్చును. ఈతడు అటు కాళిదాసును, ఇటు శంకరులను అనుసరించుటను బట్టి యాతడీ యిరువురి కావ్యములను క్షుణ్ణమున నధ్యయనము చేసి యుండునని యూహింపవచ్చును.

శ్లో. యామామా జన్మ వినయత్యతిదుఃఖ మార్గైః
ఆసంసిద్ధేః స్వకలితైర్ల లితైర్విలాసైః
యామే బుద్ధిం సువిదధే సతతం ధరణ్యామ్
సామ్బా సర్వామమగతిః సఫలేఽఫలేవా.

టీక- యా=ఏ లోకేశంరేశ్వరి, మాం=నన్ను, ఆజన్మ = పుట్టిన దాదిగా, స్వకలితైః=తానుగా కల్పించిన, లలితైః=లలితములైన, విలాసైః =విలాసముల చేత, అతిదుఃఖ మార్గైః=మిక్కిలి దుఃఖ భూయిష్ఠములయిన మార్గముల ద్వారా, ఆసంసిద్ధేః=లక్ష్య సిద్ధికి, వినయతి = చేర్చుచున్నదో, యా=ఏ తల్లి, మే=నా యొక్క, బుద్ధిం=బుద్ధిని, ధరణ్యాం=ఈ భూమి యందు (ఈ ప్రపంచము నందని యర్థము), సతతం=ఎల్లప్పుడు, సువిదధే= సరిగా నుంచుచున్నదో, సర్వా=సర్వాత్మురాలైన, సా అంబా=ఆ జగజ్జనని, సఫలే=నాచేయు కర్మల యొక్క సాఫల్యమునందు గాని, అఫలే=వైఫల్యము నందుగాని, మమ=నాకు, గతిః=దిక్కు.

తాత్పర్యము: నేను పుట్టినదాదిగా, ఏ తల్లి తన లీలావిలాసార్థము తానుగా నాకు కల్పించిన దుఃఖకరములైన మార్గముల ద్వారా నన్ను భద్రముగా దాటించుచూ నా లక్ష్యసిద్ధికి చేర్చుచున్నదో, ఏ తల్లి యెల్లప్పుడూ నా బుద్ధిని సరిగ నుంచుచు నాకు స్ఫూర్తిని ప్రసాదించుచున్నదో, ఆ తల్లి, సర్వము తానయైన ఆ తల్లియే నాచేయు కర్మల సాఫల్యమునందుగాని, వైఫల్యము నందుగాని నాకు దిక్కు. శరణ్యము.

ఇందు వివేకానందుని యొక్క స్థితప్రజ్ఞ లక్షణము మిన్ను ముట్టినదని చెప్పవలయును. ఆ జగజ్జననికి తనను తాను సమర్పించుకొని జీవన్ముక్తునివలె వెలుగొందుచున్న మహనీయు డాతడు!

తప్పటడుగులు వేయుచున్న పసిపిల్లవాని చిగురుటాకుల వంటి చిటికెన వ్రేలు పట్టుకొని తల్లి సున్నితముగను, జాగ్రత్తగను నడిపించుకొనిపోవు హృద్యమైన దృశ్యము ఈ శ్లోకమున చిత్రీకరింపబడి సుందరమగు దివ్యానుభూతి గొల్పుచున్నది. ఇందు ఆత్మాశ్రయ కవితాచ్ఛాయలు స్ఫురించుచున్నవని చెప్పవచ్చును.

# శివస్తోత్రమ్

ఓం నమః శివాయ

టీక- ఓం=ఓం, శివాయ=శివునకు, నమః=నమస్కారము.

తాత్పర్యము- ఓం అనునది బ్రహ్మము. ఈ జగత్తంతయు ఓంకారమే. వర్ణత్రయ సముదాయరూపమగు దీనియందు అకార ఉకార మకారములు అంతర్భవించియున్నవి. ఈ యక్షరములు క్రమముగా బ్రహ్మ విష్ణు మహేశ్వర వాచకములు. ఇట్టి మూర్తిత్రయ మూలభూతమగు నీప్రణవము పరమేశ్వర వాచకము భూత భవిష్యద్వర్తమాన రూపమగు కాలము, కాలాతీతమగు పరమేశ్వర రూపము సర్వము ఓంకారమే "నమః శివాయ" ఇవి శివపంచాక్షరీ మంత్రము.

తత్త్వవేదియు, మహాకవియునగు శ్రీ వివేకానందులు ఈ మంత్ర జపము శివస్తోత్రమును ప్రారంభించుచున్నారు. శ్రీ శంకరులు తొలుత 'సౌందర్యలహరి'ని మలుత "శివానందలహరి"ని వ్రాసినట్లు ప్రతీతి. శంకరుల అపరావతారమే అయిన శ్రీ వివేకులు కూడ ఆ క్రమములో మొదట అంబను స్తుతించి ఇప్పుడు శివుని స్తుతించుచున్నారు.

శ్లో. నిఖిల భువన జన్మస్థేమభఙ్గప్రరోహాః
అకలిత మహిమానః కల్పితా యత్ర తస్మిన్
సువిమల గగనాభే ఈశసంస్థేఽప్యనీశే
మమభవతు భవేఽస్మిన్ భాసురోభావబంధః

టీక- యత్ర=ఏ శివునియందలి, అకలిత మహిమానః=అనంతములైన మహిమలు, నిఖిల=సమస్తములైన. భువన = లోకముల యొక్క, జన్మ=సృష్టికి, స్థేమ=స్థితికి, భంగ=లయమునకు, ప్రరోహాః=కారణములుగా, కల్పితాః=కల్పింపబడుచున్నవో, సువిమలగగనాభే - సువిమల=అందమైన, స్వచ్ఛమైన గగన=ఆకాశముతో, ఆభే=సమానుడైన వాడును, అనీశే=మరొక ఈశ్వరుడు లేక, ఈశసంస్థే=తానే యీశ్వరశబ్ద వాచ్యుడును అయిన, తస్మిన్=ఆ పరమశివునియందు, అస్మిన్ భవే=ఈ జన్మమునందు, మమ=నాయొక్క, భాసురః=ప్రజ్వరిల్లుచున్న, (ఒప్పుచున్న) భావబంధః= భక్తిభావబంధము, భవతు=అగుగాక. (సమర్పితమవుగాక అని యర్థము)

తాత్పర్యము- ఎవడు ఈ జగత్తుయొక్క సృష్టి స్థితిలయములకు కారణభూతుడో, ఎవని మహిమలు అనంతములో, ఎవడు అకాశమువలె స్వచ్ఛమైన,

అందమైన దేహకాంతి గలవాడో, ఎవడు సర్వాత్ముడో, అద్వితీయుడో, అట్టి ఆ పరమేశ్వరుని యందు నా యీ జీవిత పరమార్థమగు భక్తి భావబంధము సమర్పింపబడుగాక.

అలంకారము- సువిమలగగనాభే...ఈశసంస్థే-అనుచోట ఉపమ.

విశేషము- ఆకాశమువలె అందమైన స్వచ్ఛమైన దేహకాంతి గలవాడు పరమశివుడు అని వర్ణించుట క్రొత్తపోకడ. ఆకాశము నీలముగను, శివుడు తెల్లగను ఉందురు. మఱి యీ పోలిక ఎట్లు కుదురును? అన్నది ప్రశ్న. నిండు పున్నమినాటి ఆకాశమువలె అని భావింపవలయునని సమాధానము చంద్రుడాకాశముననేగాదు శివుని శిరముపై గూడ నుండునను మృదువైన ధ్వనియు నిచట స్ఫురింపగలదు.

శ్లో. నిహత నిఖిల మోహేఽధీశతా యత్ర రూఢా
ప్రకటిత పరప్రేమ్ణాయో మహాదేవసంజ్ఞః
అశిథిలపరిరంభః ప్రేమరూపస్య యస్య
ప్రణయతి హృది విశ్వం వ్యాజమాత్రం విభుత్వమ్.

టీక- నిహత = నిర్మూలింపబడిన, నిఖిల = సమస్తమైన, మోహే = మోహముగల, యత్ర = ఏ పరమేశ్వరుని యందు, అధీశతా = అధీశ్వరత్వము, రూఢా = స్థిరమై యున్నదో, ప్రకటిత పరప్రేమ్ణా - ప్రకటిత = వ్యక్తము చేయబడిన, పర = మించిన, ప్రేమ్ణా = వాత్సల్యముచేత, యః = ఎవడు, మహదేవ సంజ్ఞః = మహాదేవుడను బిరుదువహించెనో, ప్రేమరూపస్య = ప్రేమ స్వరూపుడైన, యస్య = ఎవనియొక్క, అశిథిల పరిరంభః-అశిథిల = పట్టుసడలని, పరిరంభః = పరిష్వంగము (కౌగిలి), హృది = దేహధారుల హృదయము నందు, విశ్వం = జగత్తును వ్యాజమాత్రం = మిషతో మాత్రమే కూడిన, విభుత్వం = ప్రభుత్వము గలదివలె ప్రణయతి = నెఱపుచున్నదో !

తాత్పర్యము : సకలమోహములను పరిమార్చినవాడు పరమశివుడు. అందువలన ఆతడు అధీశ్వరుడను ప్రసిద్ధి నందినాడు. జీవకోటుల యందప్రతిమానమైన వాత్సల్యమును చూపుటవలన "మహాదేవుడను ఘనత వహించినాడు. మహాదేవుని వాత్సల్య పరిష్వంగము పట్టుసడలనిది. ఆతడు బాహ్యదృష్టికి అధికారమును చెలాయించు ప్రభువుగా కాన్పించునేగాని, ఆంతర్యమున ప్రాణుల హృదయములందు ప్రేమామృతమును కురియు ఆత్మీయుడే సుమా !

విశేషము : శివుడు నిర్మోహత్వమువలన అధీశ్వరుడై, ప్రేమ స్వరూపు డగుటవలన మహాదేవుడై ప్రాణుల హృదయములను చూరగొనినాడని ప్రతి పాదింపబడినది. స్వార్థరాహిత్యము, ప్రేమభావము ఈరెండును మహాగుణములు. ఇవి గలిగినవాడు మహాపురుషుడగును ప్రజా హృదయములను చూరగొనును. మానవుడీ గుణములను సంతరించుకొనవలయునని మహాకవి సందేశము. ఇది ప్రతిపాదించినతీరు రమ్యముగ నున్నది.

శ్లో॥ వహతి విపులవాతః పూర్వ సంస్కారరూపః
ప్రమథతి బలవృందం ఘూర్ణితేవోర్మిమాలా
ప్రచలతి ఖలు యుగ్మం యుష్మదస్మత్ప్రతీతం
అతివికలితరూపం నౌమిచిత్తం శివస్థమ్.

టీక - పూర్వ సంస్కారరూపః = పూర్వజన్మలో చేసిన కర్మల ఫలిత ముగా సంచితమైన సంస్కార రూపమైన, విపులవాతః = పెనుతుఫాను గాలి, వహతి = వీచుచున్నది. ఘూర్ణితా ఊర్మిమాలా ఇవ = కలగుండువడుచున్న త రంగములవలె, బలవృందం = శక్తి సంఘాతమును, ప్రమథతి = కదలించి వేయుచున్నది, యుష్మదస్మత్ప్రతీతం = నీవు, నేను అనెడు, యుగ్మం = ద్వైత భ్రాంతిం, ప్రచలతిఖలు = పనిచేయుచున్నదే అతివికలిత రూపం = మిక్కిలి కలిత రూపములో నున్న, చిత్తం...మనస్సును, శివస్థం = శివునియందుంచి, నౌమి = నమస్కరించుచున్నాను.

తాత్పర్యము :- పూర్వజన్మ కృతకర్మ సంచిత సంస్కారరూపమైన ప్రచండమైన ఝంఝూనిలము నన్ను వెంటాడుచున్నది. అది జలమును ఉల్లోల కల్లోలిత మొనర్చునట్లు నా సర్వశక్తి సంఘాతమును కదల్చివేయుచున్నది. ఆశ్చర్యము! నీవు-నేను, అనుద్వైత భ్రాంతిలో చిత్తము చెదఱిపోవుచున్నది. మిక్కిలి వికలమైపోయిన చిత్తమును శివునియధీనమొనర్చి ప్రణమిల్లుచున్నాను.

అలంకారము: వహతి విపుల వాతః పూర్వ సంస్కార రూపః అనుచోట రూపకము. ప్రమథతి బలవృందం ఘూర్ణితే వోర్మిమాలా-అనుచోట ఉపమ.

ఈ రూపకప్రయోగము అచుంచిత రమణీయముగనున్నది. దాని నను సరించిన ఉపమయు సొగసుగానున్నది మహా కవి యలంకారప్రయోగ వైచిత్రికి నిదర్శనములు ఇందు కొన్ని గలవు. వానిలో నిది యొకటి.

విశేషము: ఇచట అద్వైతము ప్రతిపాదింపబడినది. ఇప్పటివఱకు నీవు-నేను అనుద్వైత భ్రాంతిలోపడి ఇప్పుడు చిత్తము శివుని యధీనమైనది. నేను -

నీవు అను భావమంతరించి నీవే నేను - అన్న స్థితి వచ్చినదన్నమాట. ఇది యద్వైతము.

శ్లో. జనక జనిత భావోవృత్తయః సంస్కృతాశ్చ
అగణనబహు రూపో యత్ర ఏకో యథార్థః
శమిత వికృతివాతే యత్ర నాంతర్బహిశ్చ
తమహహ హరమీడే చిత్తవృత్తేర్నిరోధమ్

టీక - జనక జనిత భావః - జనక = పుట్టించువాడు, జనిత = పుట్టిన వాడు అనెడు, భావః = భావము, సంస్కృతాః = పవిత్రీ కృతములైన, వృత్తయః = మనోవృత్తులు, అగణనబహురూపః - అగణన = అసంఖ్యాకమైన. బహురూపః = అనేకముగా భాసించురూపము, యత్ర = ఎక్కడ, ఏకః = ఏకమైపోవుట, యథార్థః = యథార్థమో, శమితవికృతివాతే - ఇట్లు పూర్వోక్త వాసనలు శమంచిన పిమ్మట, యత్ర = ఎక్కడ, అంతః = దాపలయనునదిగాని, బహిశ్చ = వెలుపల యనునదిగాని, న = లేదో, చిత్త వృత్తేః = చిత్తవ్యాపారము, నకు, అహహ = ఆశ్చర్యము, నిరోధం = నిరోధకారణమైన, తం హరం = ఆ హరుని, ఈడే = స్తుతించుచున్నాను.

తాత్పర్యము: పుట్టించువాడు, పుట్టువాడు అనుభావముగాని, సంస్కార పూరితములైన మనోవృత్తులుగాని, అసంఖ్యాకముగను, అనేకముగను దృశ్యమా నమగు రూపముగాని ఎక్కడ ఏకమైపోవుట తథ్యమో, ఇట్టి పూర్వోక్తవాసనలు శమించిన పిమ్మట ఎచ్చట దాపల వెలుపల యను భేదముండదో అట్టి చిత్త వృత్తి నిరోధకారణుడైన ఆ హరుని స్తుతించుచున్నాను.

విశేషము: చిత్తవృత్తిని నిరోధించుట యోగమనబడును-అను పాతంజల యోగ సూత్రమునకు అనుసరణ మీ శ్లోకము.

శ్లో. గలిత తిమిరమాలః శుభ్రతేజః ప్రకాశః
ధవల కమలశోభః జ్ఞానపుంజాట్టహాసః
యమిజనహృదిగమ్యః నిష్కలం ధ్యాయమానః
ప్రణతమవతు మాంసః మానసో రాజహంసః.

టీక – గలిత తిమిరమాలః - గలిత = విదల్చబడిన, తిమిరమాలః = చీకటుల సమూహముగల వాడును, శుభ్రతేజః ప్రకాశః - శుభ్ర = తెల్లనైన, తేజః ప్రకాశః తేజస్సు యొక్క ప్రకాశముగలవాడును. ధవల కమల శోభః = ధవల = తెల్లనైన, కమల = పద్మము యొక్క, శోభ. = శోభగలవాడు, జ్ఞాన

పుంజాట్టహాసః-జ్ఞానపుంజ = జ్ఞాన సముదాయ మనెడు, అట్టహాసః = అట్ట హాసము గలవాడును, (శివుని నవ్వును అట్టహాస మందురు), యమిజనహృది గమ్యః-యమిజన = యోగి జనులయొక్క, హృది = హృదయము నందు, గమ్యః = పొందదగిన వాడు, నిష్కలంధ్యాయమానః-నిష్కలం = అఖండ ముగ, ధ్యాయమానః = ధ్యానింపబడుచున్న వాడును, మానసోరాజహంసః = మానసము నందు విహరించు రాజహంసయు నగు, సః = ఆ పరమశివుడు, ప్రణతం = ప్రణిపాతముతో నమస్కరించుచున్న, మాం = నన్ను, అవతు = రక్షించుగాక.

తాత్పర్యము : చీకటులను చెదఱగొట్టు వాడును, తెల్లని తేజస్సుతో వెలుగొందువాడును, తెల్లని పద్మశోభ గలవాడును, తన అట్టహాసము నుండి జ్ఞాన పుంజమును వెలార్చువాడును, నిరంతరము ధ్యాన నిమగ్నులయిన యోగుల హృదయముల యందు సాక్షాత్కరించువాడును, నా మనస్సనెడి మానస సరోవర మున విహరించు రాజహంసయు నగు నా పరమశివుడు నన్ను రక్షించుగాక.

అలంకారము : ధవలకమలశోభః-అనుచోట ఉపమాలంకారము.
జ్ఞానపుంజాట్టహాసః-అనుచోట రూపకాలంకారము.
మానసోరాజహంసః-అనుచోట రూపకాలంకారము.

మానసో రాజహంసః- అన్నది చక్కని రూపకాలంకారము. రూపకము ఒకానొక భావావేశమున అప్రయత్నముగ నుట్టిపడు నలంకారమని ప్రతీతి. ఈ శ్లోకమున వరుస వరుసగా వివిధ విశేషణముల చేత పరమేశ్వరుని వర్ణించిన తీరు అట్టి యావేశమును సూచించుచున్నది. కాగా రూపక ముట్టినది. రాజహంస మానస సరోవరమున విహరించునసుట తెలిసిన విషయమే. ఇక్కడ వివేకానందుని యొక్క మనస్సే మాన(స) సరోవరము అందు విహరించు రాజహంస ఇది. యోగులు కుండలినీ శక్తిని మేల్కొల్పినపుడు మూలాధార చక్రమునుండి బయలుదేరిన కుండలిని అనాహత చక్రమును చేరుకొన్నప్పుడు ఆ పరాశక్తిని హంసేశ్వరి యనియు, పరమశివుని హంసేశ్వరుడనియు వ్యవహరింతురని గ్రంథములు వాకొనుచున్నవి. కావున "రాజహంస" అని వ్రాసినాడు వివేకానందుడు. కేవలము 'హంస' యన్నచో చాలును. రాజ శబ్దమును ప్రయోగించుట ఆతని కిష్టమగు "రాజ యోగము" ను సూచించుటకే యని గ్రహింపదగును. ఈ శ్లోకము శంకరుల సౌందర్య లహరిలోని "సముస్మీలత్సవిత్కమల మకరన్దైక

రసికం భజే హంసవ్వంద్వం కిమపి మహతాం మానసచరమ్'' అను 38 వ శ్లోకము సందలి కట్టుబడిని పుణికి పుచ్చుకొని వ్రాసినట్లున్నది.

శ్లో. దురితదలనదక్షం దక్షజా దత్తదోషం
కలితకలికలఙ్కం క్రమకల్హారకాంతమ్
పరహితకరణాయప్రాణ విచ్ఛేదసూత్కం
నతనయ నని యుక్తం నీలకంఠం నమామః.

టీక - దురితదలన దక్షం-దురిత = పాపములను, దలన = పోగొట్టుట యందు, దక్షం = సమర్థుడును, దక్ష జాద త్తదోషం-దక్షజా = దాక్షాయణిచేత, దత్త = ఇవ్వబడిన (కల్పింపబడిన అని భావము), దోషం = దోషముగల వానిని, కలితకలి కలంకం - కలిత = ఒప్పుచున్న, కలి = కలికాల సూచకమైన, కలంకం = కళంకము గల వానిని, క్రమ కల్హార కాంతం-క్రమ = అందమైన, కల్హార = కమలమువలె. కాంతం = మనోహరుడైన వానిని, పరహిత కరణాయ పర = ఇతరులకు, హిత = మేలును, కరణాయ = చేయుట కొఱకు ప్రాణ విచ్ఛేద సూత్కం - ప్రాణ = ప్రాణములను, విచ్ఛేద = పోగొట్టుకొనుటకు, సూత్కం = సిద్ధపడు వానిని, నతనయన నియుక్తం-నత = వినమ్రులైన వారి యందు, నయన = నేత్రమును (కరుణాకటాక్ష వీక్షణములను) నియుక్తం = పఱపు వానిని, నీలకంఠం = నీలమైన కంఠముగల శివుని, నమామః-నమస్కరించుచున్నాము.

తాత్పర్యము : పాపములను పోగొట్టగల సమర్థుడును, దాక్షాయణి కల్పించిన దోషము గలవాడును, కలికాల సూచకమగు కలంకముచేత నొప్పుచున్న వాడును, కమనీయమైన కమలకాంతివంటి కాంతిచేత మనోహరుడును, పరోపకారము చేయుట కొఱకు ప్రాణములను సైతము పణము పెట్టువాడును, నతులగు వారియందు కరుణాకటాక్ష వీక్షణములను బఱపువాడును, నగు నీలకంఠునకు నమస్కరించుచున్నాము.

అలంకారము- క్రమ కల్హారకాంతమ్-అనుచోట ఉపమ.

విశేషము - ఇందు ''పరహిత కరణాయ ప్రాణవిచ్ఛేదసూత్కం'' అన్నది చాలా ముఖ్యము. ప్రాణత్యాగమునకు తెగింపగల సేవానిరతిని ఉపదేశించు వాక్యమిది. 'సూత్కం' అనునది కొంత క్రొత్త ప్రయోగము. "కలిత కలికలంకలి'' కలికాల దోష సూచకమగు కలంకము అని చెప్పుట క్రొత్త

సమన్వయము. ఇది సమకాల సమాజమునందలి అస్తవ్యస్త పరిస్థితిని సూచించుచున్నది.

ఈ అంబాస్తోత్ర శివస్తోత్రములు రెండును వివేకానందుడు కేవలము జ్ఞాని మాత్రమే కాదు; ఆర్ద్రహృదయుడైన భక్తుడనిగూడ తేటతెల్లము చేయుచున్నట్లు భావింపవలయును.

## ఎవరికి భయపడుదుము!

శ్లో. కుర్మ స్తారక చర్వణం త్రిభువన ముత్పాట యామోబలాత్
కింభో న విజానా స్యస్మాన్ రామకృష్ణ దాసావయమ్.

టీక- తారకచర్వణ-తారక = నక్షత్రములయొక్క, చర్వణం = పొడిని, కుర్మః = చేయగలము, త్రిభువనం = ముల్లోకములను. బలాత్ = కూకటి వ్రేళ్ళతో, ఉత్పాటయామః = పెకలించి వేయగలము, భోః = అయ్యా, ఓయీ, అస్మాన్ = మమ్ములను, న విజానాసి కిం = ఎఱుగవా? వయం = మేము, రామకృష్ణ దాసాః = రామకృష్ణ పరమహంస శిష్యులము.

తాత్పర్యము : నక్షత్రములను రాల్చి పొడిపొడి చేయగలము, ముల్లోకములను కూకటి వ్రేళ్ళతో పెకలించి వేయగలము, ఓయీ! మేమెవ్వరమో తెలియదా? రామకృష్ణ పరమహంస శిష్యులము! ఎంత గురుభక్తి! ఎంతటి ఆత్మ విశ్వాసము!

శ్లో. క్షీణాఃస్మ దీనాః సకరుణా జల్పంతి మూఢా జనాః
నాస్తిక్యం త్విదంతు అహహ దేహాత్మ వాదాతురాః
ప్రాప్తాఃస్మ వీరా గతభయా అభయం ప్రతిష్ఠాం యదా
ఆస్తిక్యం త్విదంతు చినుమః రామకృష్ణ దాసావయమ్.

టీక- దేహాత్మవాదాతురాః = దేహము ఆత్మ ఒకటేయని భావించు, మూఢాజనాః = మూఢులైన జనులు, క్షీణాః స్మ = మేము హీనులము, దీనాస్మ = మేము దీనులము, అని, సకరుణాః = జాలిగొలుపుచు, జల్పంతి = వాపోవుదురు, నాస్తిక్యంతు = నాస్తిక్యమనగా, ఇదంతు = ఇదియేగదా! వయం = మేము, అభయం = అభయమును, ప్రతిష్ఠాం = ప్రతిష్టను, యదా = ఎప్పుడు, ప్రాప్తాస్మ = పొందితిమో, అది మొదలుకొని గతభయాః = నిర్భీతచేతస్కులము, వీరాః = వీరులము, అయితిమి, ఆస్తిక్యంతు = ఆస్తిక్యమనగా, ఇదంతు = ఇదియే, రామకృష్ణ దాసాః = రామకృష్ణుని దాసులమైన, వయం = మేము, చినుమః = ఎన్నుకొను మార్గము.

తాత్పర్యము : దేహము ఆత్మ ఒకటికాదు, దేహము క్షణ భంగురము, ఆత్మ నిత్యమైనది. కాని మూర్ఖులైన కొందఱు ఇది తెలియక రెండును ఒక్కటియే అను భ్రమలోపడి, మేము హీనులము, దీనులము అని జాలిగా వాపోవుచుందురు. ఆశ్చర్యము ఇంతకు మించిన ఆస్తిక్యమేమున్నది ? ఇక మేమో, అభయమును, ప్రతిష్ఠను సంపాదించుకొని, నిర్భీత చేతస్కులముగా, వీరులముగా తయారైతిమి. నిజమైన ఆస్తిక్య మనగా నిదియే సుమా, రామకృష్ణుని దాసులమైన మేము ఎన్ను కొన్న మార్గము. ఇదియే "నాయమాత్మా బలహీనేన లభ్యతే" అను ఉపనిషద్వాక్య సారమే యీ శ్లోకము.

శ్లో. పీత్వా పీత్వా పరమ మమృతం వీత సంసారరాగాః
హిత్వా హిత్వా సకల కలహ ప్రాపిణీం స్వార్థ సిద్ధిమ్
ధ్యాత్వా ధ్యాత్వా గురువర పదం సర్వకల్యాణ రూపమ్
నత్వా నత్వా సకల భువనం పాతు మామంత్రయామః.

టీక - వీతసంసారరాగాః-వీత = తొలగిపోయిన, సంసారరాగాః = సంసారమునందలి రాగము, తాపత్రయము మొదలగునవి గలవారై, పరమం = సర్వశ్రేష్ఠమైన, అమృతం = అమృతమును, పీత్వా పీత్వా = త్రాగి త్రాగి, సకల కలహప్రాపిణీ, సకల = సమస్తములైన, కలహ = కలహములను, ప్రాపిణీం = కలిగించునట్టి, స్వార్థసిద్ధిం = స్వార్థప్రయోజనమును, హిత్వాహిత్వా = ప్రక్కకునెట్టి, సర్వకల్యాణరూపం = సకలమంగళస్వరూపమైన, గురువరపదం = రామకృష్ణుల చరణమును, ధ్యాత్వా ధ్యాత్వా = నిరంతరము ధ్యానించి, పాతుం = ఆ పాదామృతమును గ్రోలుటకు, సకలభువనం = సమస్తప్రపంచమును, నత్వానత్వా = మాటిమాటికి నమస్కరించి, ఆమంత్రయామః = ఆహ్వానించుచున్నాము.

తాత్పర్యము : అయ్యలారా ! ఈ సంసార తాపత్రయములను విడనాడి రామకృష్ణుని సేవాసారములచే లభించిన యమృతమును గ్రోలుడు. కలహము లన్నింటికీ కారణమైన స్వార్థమును కాలదన్ని సర్వకల్యాణప్రదమైన రామకృష్ణుల చరణములను సేవింపుడు. ఓ విశ్వమానవులారా! రండు! రామకృష్ణుల పాదామృతముచే తరింపవలసినదిగా మిమ్ములను మాటిమాటికి నమస్కరించి యాహ్వానించుచున్నాము.

శ్లోకముయొక్క ప్రతి చరణమునందును మొదట ప్రయోగింపబడిన క్త్వార్థక క్రియాపదముల ద్విరుక్తివలన రమ్యమైన రచనాకళ ఉట్టిపడుచున్నది.

రామకృష్ణుల సేవకై సకల భువనములను ఆహ్వానించుచున్నాడనగా మన ఆధ్యాత్మిక తత్త్వము ప్రపంచమునకే భిక్ష పెట్టగలదనియు, ఇది విశ్వజనీనమైన తత్త్వమనియు ఎలుగెత్తి చాటుచున్నాడనియు భావింపవలయును.

శ్లో. ప్రాప్తం యద్వైత్వనాదినిధనం వేదోదధిం మథిత్వా
దత్తం యస్య ప్రకరణే హరిహరబ్రహ్మాది దేవైర్బలమ్
పూర్ణం యత్తు ప్రాణసారైర్భౌమ నారాయణానాం
రామకృష్ణ స్తనుంధత్తే తత్పూర్ణపాత్రమిదం భోః !

టీక- భోః = ఓయి! యద్వైతు-యత్ వైతు = ఏ అమృతమైతే, అనాదినిధనం = అనాదికాలమునుండియు మనతత్త్వమునకు మూలనిధియైన, వేదోదధిం-వేద = వేదములనెడు, ఉదధిం = సముద్రమును, మథిత్వా = మథించి (మథించుటద్వారా), ప్రాప్తం = పొందబడినదో, యస్య = ఏ అమృతముయొక్క, ప్రకరణే = ఆయా ప్రకరణమునందు (ఆయా భాగములలో), హరిహరబ్రహ్మాదిదేవైః, హరి = విష్ణువు, హర = శివుడు, బ్రహ్మ = బ్రహ్మ, ఆది = మొదలుగాగల, దేవైః = దేవతలచేత, బలం = శక్తి, ఇవ్వబడినదో, యత్తు = ఏ అమృతమైతే, భౌమనారాయణానాం-భౌమ = బహురూపముగా పరిణమించిన, నారాయణానాం = నారాయణుని అవతారములయొక్క, ప్రాణసారైః = ప్రాణసారములచేత, పూర్ణం = నిండింపబడినదో, తత్పూర్ణపాత్రమిదం-తత్ = ఆ, ఇదం = ఈ, పూర్ణపాత్రం = పూర్ణపాత్రమును, తనుం = శరీరముగా, రామకృష్ణః = రామకృష్ణుడు, ధత్తే = ధరించుచున్నాడు. (సుమా).

తాత్పర్యము : నాయనలారా! వినుడు, రామకృష్ణుని సేవాసారములచే మనము త్రాగు అమృతమును గూర్చి వినుడు. అది మన ఆధ్యాత్మిక తత్త్వమునకు మూల స్రోతస్సులైన వేదము లనెడు సముద్రములను మథించగా లభించినట్టిది. ఆయా ప్రకరణములలో హరిహర బ్రహ్మాది దేవతలు తమ తమ మాహాత్మ్యబలమును మిళితముచేసి ప్రసాదించినట్టిది. నారాయణుడు ఎత్తిన అనేక అవతారములయొక్క ప్రాణసారములచేత నిండింపబడినట్టిది.

ఆ పూర్ణపాత్రమే రామకృష్ణ పరమహంస రూపమున యీ భూమిపై అవతరించినది సుమా! వేదసారమే రామకృష్ణుడనుట !

అలంకారము :- రామకృష్ణ స్తనుంధత్తే తత్పూర్ణపాత్రమిదం అనుచోట రూపకము.

"ప్రాణసారైః" (Life essence) అను ప్రయోగము కడు రమ్యమైనది.

భౌమనారాయణానాం" అనుచోట ప్రయోగింపబడిన 'భౌమ' అను మాట వివేకానందుని సంస్కృత భాషా పాండిత్యమునకు సూచకముగ నున్నది. ఈ శబ్దము ఏర్పడిన విధమిది: "బహోర్భావః" అను నర్థమునందు బహు శబ్దముకంటె "పృథ్వాదిభ్యః ఇమనిజ్వా" (పా. 5-1-122) అను పాణినియొక్క అను శాసనమున "ఇమనిచ్" ప్రత్యయము రాగా "బహోర్లోపోభూ చ బహోః" (పా. 6-4-158) అను సూత్రముచే 'బహు' శబ్దమునకు 'భూ' ఆదేశమగును. ప్రత్యయాదీకార లోపము కలుగగా "భూమా" అను రూపమేర్పడుచున్నది. 'భూమా' యొక్క భావము 'భౌమ' అగుచున్నది. దీనికి బహుభావమనియు, నిరతిశయానంద రూపమగు బ్రహ్మమనియు నర్థములు. ఛాందోగ్యోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది: "యత్ర నాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి సభూమా" (ఛాం. 7-32) దేనియందు వేఱొక ద్రష్టవ్యము గాని, శ్రోతవ్యము గాని జ్ఞాతవ్యము గాని యుండదో అనగా నంతయు నొకే పదార్థముగా అయి ఉండునో అదియే భూమ. ఇట్టి ప్రయోగములే మహాకవులయొక్క ప్రతిభా పాండిత్యములకు నికషోపలములు.

## రామకృష్ణస్తోత్రమ్

శ్లో. ఓం హ్రీం ఋతం త్వమచలో గుణజిత్ గుణేడ్యో
నక్తం దివం సకరుణం తవపాదపద్మమ్
మోహఙ్కషం బహుకృతం న భజే యతోఽహం
తస్మాత్త్వమేవ శరణం మమ దీనబంధో!

టీక— ఓం = ఓంకారము, హ్రీం = హ్రీంకారము, ఋతం = సత్యము, త్వం = నీవు, అచలః = చలనములేని వాడవు, గుణజిత్ = త్రిగుణములను జయించినవాడవు, గుణేడ్యః-గుణ = త్రిగుణములచేత, ఈడ్యః = స్తుతింపబడు చున్న వాడవు, అహం = నేను, తవ = నీ యొక్క, మోహంకషం = మోహములను పోగొట్టునదియు, బహుకృతం = బహు విధములగు ఫలముల నిచ్చునదియు, సకరుణం = దయగలదియునగు, పాదపద్మం = పాదపద్మమును, యతః = ఎందువలననో గాని, నక్తందివం = రాత్రింబవళ్ళు, న భజే = సేవింప లేకపోవుచున్నాను, తస్మాత్ = అందువలన, దీనబంధో = ఓ దీనబంధూ!, త్వం ఏవ = నీవే, మమ = నాకు, శరణం = దిక్కు.

తాత్పర్యము : రామకృష్ణ పరమహంస ఓంకార వాచ్యుడు. హ్రీంకార రూపుడు. కావున సచ్చిదానంద రూపుడు నిత్య సుందరుడు. స్థిరుడు. సత్త్వ రజస్తమోగుణములను జయించిన వాడు. అట్లయ్యును ఈ మూడు గుణములచే స్తుతింపబడుచున్నవాడు. అతని పాదపద్మము, దయా పూరితము, మోహములను నిర్మూలించును. బహువిధ ఫలములను ప్రసాదించును. అట్టి ఆ పాదపద్మమును తాను అహోరాత్రములు సేవింపలేక పోవుచున్నాడట. కావున ఒక్క మాటలో "ఓ దీనబంధూ నీవే నాకు శరణము దిక్కు" అని మొఱ పెట్టుకొనుచున్నాడు వివేకుడు.

విశేషము- ఓంకారము పరమేశ్వర వాచకము, హ్రీంకారము పరమేశ్వరీ వాచకము. ఇచ్చట దీనినిట్లు సమన్వయించు కొనవలయును. ఓంకార వాచ్యుడును, సచ్చిదానంద రూపుడును అయిన పరమేశ్వరుడు దేహము, కరచరణాద్యవయవములు లేనివాడు. కాని, భక్తానుగ్రహము కొఱకు అత్యంత సుందరమైన రూపమును ధరించుచుండును. వారికి సాక్షాత్కరించి ఆనందింప జేయుచుండును. ఇట్లు నిరాకారుడైన పరమేశ్వరునకు సుందరమైన ఆకృతి ఎట్లు లభించుచున్నది అను సందేహము కలుగును. "మాయ"చే కలుగుచుండునని సమాధానము. 'మాయ'ను ప్రకృతిగా తెలియవలెను. 'మాయ' యనుడు, 'ప్రకృతి' యనుడు దీనికి సంకేతము హ్రీంకారము. ఉపాసకుడు తన సాధనా బలముచే సాక్షాత్కరింపజేసుకొనుచున్న పరమేశ్వరుని రూపము ఆతడు ఉపాసకుల యొక్క అనుగ్రహము కొఱకు తన మాయచే ధరించినదే గాని నిజంకాదని భావము.

ఈ సర్వ విషయమును ప్రకృంతాశమున రామకృష్ణుని యెడల ఇట్లు సమన్వయించు కొనవలయును. నిరాకారుడును ఓంకార వాచ్యుడును అయిన ఆ పరమేశ్వరుడే హ్రీంకార వాచ్యమగు తన మాయచేత రామకృష్ణుడుగా రూపము ధరించి యవతరించినాడు అని.

వివేకానందుడు ఈ శ్లోకమును వ్రాసిన తీరును బట్టి ఒక విచిత్రము, నిగూఢమునైన రహస్యము గోచరించుచున్నది. ఈతడు రామకృష్ణుని ప్రత్యక్షముగ చూసి కొన్ని సంవత్సరములు సేవించినాడు. ఈతడు సేవించిన రామకృష్ణుడు, హ్రీంకారవాచ్యమగు, 'మాయ' చేత రూపమును ధరించి యవతరించిన వాడు. ఆ మాయ అంతరించినదే తడవు ఆ రూపము తిరోహితమైనది. ఇప్పుడు రామకృష్ణుడు లేడు. తాను ఉపాసింపవలసినది నిరాకారుడైన రామకృష్ణుని మాత్రమే. అనగా ఇప్పుడు ప్రత్యక్షముగ పూజించుటకు రామకృష్ణుడు

లేడు. ఆ వెలితి వివేకానందుని వెంటాడుచున్నది. కావున వెనుకటివలె నిన్ను పూజించుటకు నీవు సాకారుడవై లేవు. అందువలన రాత్రింబవళ్ళు నిన్ను పూజింపలేక పోవుచున్నాను. ఓదీనబంధూ, నీవే శరణము అని వాపోవుచున్నాడు. ఇది కవి యొక్క తత్కాల మానసిక స్థితిని వ్యక్తము చేయు చిత్రమైన శ్లోకము. ఇట్టి విచిత్ర భావభరితమగు శ్లోకమును వ్రాయుట ఈతనికే చెల్లినది!

శ్లో. భక్తిర్భగశ్చ భజనం భవభేదకారి
గచ్ఛంత్యలం సువిపులం గమనాయ తత్త్వమ్
వక్త్రోద్ధృతంతు హృదియే నచ భాతి కించిత్
తస్మాత్త్వమేవ శరణం మమ దీనబంధో!

టీక - భక్తిః - భక్తి, భగః = జ్ఞానము, భజనం = పూజించుట (ఇవి), భవభేదకారి గచ్ఛంతి = చావు పుట్టుకల చక్రమును భేదించగలవి యగుచున్నవి. సువిపులం = మిక్కిలి గొప్పదియగు, తత్త్వం = తత్త్వమును (సత్యమును అని యర్థము) గమనాయ = అరయుట, కొఱకు, అలం = చాలును, వక్త్రోద్ధృతంతు - వక్త్రి = నోటినుండి, ఉద్ధృతంతు = వచ్చిన ప్రతిమాటయు, మే = నాయొక్క, హృది = హృదయమునందు, కించిత్ = కొంచెమైనను, న చ భాతి = అగపడుట లేదు. తస్మాత్ = అందువలన, హే దీనబంధో = ఓ దీనబంధూ!, త్వం ఏవ = నీవే, మమ = నాకు, శరణం = శరణము.

తాత్పర్యము:- భక్తిజ్ఞాన భజనములు మూడును చావు పుట్టుకల చక్రమును భేదించి, సంసార తాపత్రయములను తొలగించి, సత్యతత్త్వము నరయుటకు సరిపోవును, కాని యివి యన్నియు నోటి మాటల వఱకే గాని హృదయమున పనిచేసి అనుభవమునకు వచ్చుటలేదు. కావున ఓ దీనబంధూ, నాకు నీవే శరణము.

శ్లో. తేజస్తరంతి తరసా త్వయి తృప్త తృష్ణాః
రాగేకృతే ఋతపథే త్వయి రామకృష్ణే
మర్త్యామృతం తవ పదం మరణోర్మి నాశం
తస్మాత్త్వమేవ శరణం మమ దీనబంధో!

టీక - ఋతపథే = సత్యమార్గమే నీవైన, రామకృష్ణే = రామకృష్ణుడవైన, త్వయి = నీయందు, రాగేకృతే = భక్తి నిలిపినచో, త్వయి = నీయందు; తృప్త

తృప్తాః- తృప్త=తృప్తిచెందిన, తృష్ణాః=వాంఛలు గలవారై, తరసా=వెంటనే, తేజః=రజోగుణమును, తరంతి=దాటుదురు, తవ=నీ యొక్క, పదం=పాదము, మాట, మర్త్య=మానవుల యొక్క, మరణోర్మినాశం- మరణ=మృత్యువుయొక్క, ఊర్మి=తరంగములను, నాశం=నశింపజేయునట్టి,అమృతం=అమృతము.తస్మాత్=అందువలన,దీనబంధో=దీనబంధూ,! త్వం ఏవ=నీవే, మమ=నాకు, శరణం=శరణము.

తాత్పర్యము- సత్యమార్గమన రామకృష్ణుడే! రామకృష్ణుడవైన నీయందు భక్తి గలిగినవాని కోరికలు తీరును. వెంటనే రజోగుణమును విడిచిపెట్టుదురు. నీ పదము మృత్యుతరంగములలో చిక్కుకొను మానవులకు అమృతమేనయ్యా! అందువలన ఓ దీనబంధూ, నిన్నే శరణు వేడెదను.

రజోగుణము అను నర్థమున 'తేజః' అన్న శబ్దమును ప్రయోగించుట క్రొత్తగా నున్నది.

శ్లో. కృత్యంకరోతి కలుషం కుహకాంతకారి
ష్ణాంతం శివం సువిమలం తవనామనాథ!
యస్మాదహం త్వశరణో జగదేకగమ్య!
తస్మాత్త్వమేవ శరణం మమ దీనబంధో!

టీక- నాథ=ప్రభూ, ష్ణాంతం- ష్ణ+అంతం='ష్ణ' అను నక్షరము చివరగల, తవ=నీయొక్క, నామ=పేరు, సువిమలం=మిక్కిలి పవిత్రమయినది, శివం=మంగళకరమైనది, కలుషం=పాపమును, కుహన=భ్రాంతిని, అంతకారి=నాశనముచేయునది, కృత్యం=సాఫల్యమును, కరోతి=చేయును, జగత్ ఏకగమ్య=జగత్తున కంతటికినీ ఒకే ఒక గమ్యస్థానమైన వాడా! యస్మాత్=ఏ యితరునివలనను, అహంతు=నేనైతే, అశరణః=శరణము లేనివాడను, తస్మాత్=అందువలన, దీనబంధో=దీనబంధూ, త్వం ఏవ=నీవే, మమ=నాకు, శరణం=శరణము.

తాత్పర్యము- ప్రభూ! రామకృష్ణా! 'ష్ణ' అను నక్షరముతో అంతమగు నీ పేరు మిక్కిలి పవిత్రమైనది. మంగళకరమైనది. పాపములను పోగొట్టునది. సకలభ్రాంతులను తొలగించునది. కృతార్థతను కలిగించునది. జగత్తున కంతటికినీ ఏకైక గమ్యస్థానమైన వాడా ! నేను ఎవ్వరి దిక్కును లేనివాడను. కావున నిన్నే శరణు జొచ్చుచున్నాను.

శ్లో. ఆచండాలా ప్రతిహతరయో యస్య ప్రేమప్రవాహః
లోకాతీతోప్యహహనజహౌ లోకకల్యాణ మార్గమ్
త్రైలోక్యేఽప్య ప్రతిమమహిమా జానకీ ప్రాణబంధో
భక్త్యాజ్ఞానం వృతవరవపుః సీతయా యో హి రామః

టీక-సః = అతడు, రామఃహి = రాముడుగదా! యస్య = ఎవనియొక్క, ప్రేమ ప్రవాహః = ప్రేమ ప్రవాహము. ఆచండాల = చండాలుడు మొదలుకొని సర్వమానవులయందు, అప్రతిహతరయః = ఎదురులేని వేగముగలదో, యః = ఎవడైతే, లోకాతీతః అపి = లోకాతీతుడయ్యును, అహహ = ఆశ్చర్య మాశ్చర్యము. లోకకల్యాణ మార్గం = లోక కల్యాణ మార్గమును, నజహౌ = విడిచిపెట్టలేదో, త్రైలోక్యే-అపి = ముల్లోకముల యందును, జానకీ ప్రాణ బంధోః = జానకికి ప్రాణనాథుడైన, యస్య = ఏ రామచంద్రునికి, అప్రతిమ మహిమా = సాటిలేని మహిమగలదో, భక్త్యా = భక్తిచేత, జ్ఞానం ఇవ = జ్ఞానము వలె, యః = ఎవడు, సీతయా = సీతచేత, వృతవరవపుః = వరింపబడిన అంద మైన దేహము కలవాడో, సః = ఆ రాముడు—

తాత్పర్యము— అతడు శ్రీరాముడు గదా! ఎవని యొక్క ప్రేమ ప్రవాహము చండాలుని మొదలుకొని సర్వ మానవుల యందు సమభావముతో ప్రచండముగ ప్రవహించుచుండునో, ఎవడు లోకాతీతుడయ్యును లోక కల్యాణ మార్గమును విడువలేదో, జానకీ ప్రాణనాథుడైన ఎవని మహిమ ముల్లోకముల యందును సాటిలేనిదో, భక్తి జ్ఞానమును వరించినట్లు ఎవనిని సీతాదేవి వరించి నదో అట్టి ఆ రాముడునూ—తరువాతి శ్లోకముతో అన్వయము.

అలంకారము = భక్తి జ్ఞానమును వరించినట్లు, సీతరాముని వరించినది - ఉపమ.

శ్లో. స్తబ్ధీకృత్య ప్రలయ కలితం వాహవోత్థం మహాంతం
హిత్వా రాత్రిం ప్రకృతి సహజాయంధతా మిస్ర మిశ్రామ్
గీతం శాంతం మధురమపి యః సింహనాదం జగర్జ
సోఽయం జాతః ప్రథితపురుషః రామకృష్ణ స్త్విదానీమ్.

టీక-యః = ఏ శ్రీకృష్ణుడు, ప్రలయ కలితం = ప్రళయముతో కూడిన, వాహవోత్థం = జంఝూనిలమునుండి పుట్టినట్లు కురుక్షేత్ర మహాసంగ్రామము నుండి పుట్టిన, మహాంతం = ప్రచండమైన నాదమును, స్తబ్ధీకృత్య = స్తబ్ధము చేసి, ప్రకృతి సహజాం = ప్రకృతి సహజముగా కలిగిన, అంధతా మిస్ర

మిశ్రాం = కటిక చీకటితో కూడిన, రాత్రిం = రాత్రిని, (అర్జునుని అజ్ఞానాంధకారమని భావము) హిత్వా = పోగొట్టి, గీతం = గీతను, శాంతం = శాంతముగను, మధురం = మధురముగను, సింహనాదం = సింహనాదమువలెను, జగర్జ = గర్జించి బోధించెనో, సః = ఆ శ్రీకృష్ణుడే, ఇదానీం = ఇప్పుడు, ప్రథితపురుషః = ప్రసిద్ధ పురుషుడైన, అయం = ఈ, రామకృష్ణః = రామకృష్ణుడుగా, జాతః = అవతరించెను.

తాత్పర్యము – ప్రళయ సమయమున సుప్పతిల్లినట్లు, కురుక్షేత్ర సంగ్రామమున సుప్పతిల్లిన మహా నాదమును స్తంభింపజేసి, అర్జునుని యావరించిన అజ్ఞానాంధకారమును పటాపంచలుచేసి ఎవడాతనికి శాంతముగను, మధురముగను, సింహనాదమువలె గంభీరముగను గర్జించి ప్రబోధించెనో, అట్టి ఆ శ్రీకృష్ణుడు నూ–కలిసి ప్రథిత పురుషుడగు ఈ రామకృష్ణునిగా నవతరించెను.

కావ్యమునకు ఆత్మ ధ్వనియందురు. ఈ రెండూ శ్లోకములందును మధురమైన వస్తు ధ్వనులున్నవి. మొదటి శ్లోకమున భక్తి జ్ఞానమును వరించినట్లు సీత రాముని వరించినదని గదా చెప్పబడినది. అప్పుడు సీతవంటి శారదాదేవి రాముని వంటి రామకృష్ణుని వరించినది అన్న మధురమైన ధ్వని సిద్ధించును. రెండవ శ్లోకమున కృష్ణుడు అర్జునునకు గీతోపదేశము చేసెనని గదా చెప్పబడినది. అప్పుడు కృష్ణుని వంటి రామకృష్ణుడు అర్జునుని వంటి వివేకానందునకు గీత వంటి గీతను ఉపదేశించినట్లు అందమైన ధ్వని సిద్ధించుచున్నది. ఇట్లే రెండు శ్లోకములు లోకోత్తర శ్లోకములై ఒప్పుచున్నవి.

శ్లో. నరదేవదేవ జయజయ నరదేవ
శక్తి సముద్ర ముత్థతరఙ్గం
దర్శిత ప్రేమ విజృంభిత రఙ్గమ్,
సంశయ రాక్షస నాశమహాస్త్రం
యామి గురుం శరణం భవవైద్యమ్
నరదేవదేవ జయజయ నరదేవ.

టీక :- శక్తిసముద్ర = శక్తియనెడు సముద్రమునందు, సముత్థిత = లేచిన, తరంగం = తరంగమైన వానిని, దర్శిత = ప్రదర్శింపబడిన, ప్రేమ = ప్రేమయొక్క, విజృంభిత = విజృంభింపబడిన, రఙ్గం = లీలలుగల వానిని, సంశయ = సంశయమనెడు, రాక్షస = రాక్షసుని, నాశ = నాశనము చేయునట్టి, మహాస్త్రం = గొప్ప అస్త్రమైన వానిని, భవవైద్యం = సంసార రోగములకు

వైద్యుడైన వానిని, గురుం = గురువును, శరణం = శరణమును, యామి = చొచ్చుచున్నాను.

తాత్పర్యము:- రామకృష్ణుడు శక్తి సముద్రమున పుట్టిన తరంగము. ఆతడనేక వాత్సల్యలీలావిలాసములను చూపించినవాడు. సంశయ రాక్షసులను ఖండించు మహాస్త్రమైనవాడు. సంసార రోగములను కుదుర్చు వైద్యుడు. వానిని శరణుజొచ్చుచున్నాను.

అలంకారము- రూపకము.

నరదేవదేవ జయజయ నరదేవ

శ్లో. అద్వయతత్త్వ సమాహితచిత్తం
ప్రోజ్వలభక్తి పటావృతవృత్తమ్
కర్మకలేవర మద్భుతచేష్టం
యామి గురుం శరణం భవవైద్యమ్.
నరదేవదేవ జయజయ నరదేవ

టీక :- అద్వయతత్త్వ = అద్వైత తత్త్వమునందు, సమాహిత = నెలకొన్న, చిత్తం = చిత్తముగల వానిని, ప్రోజ్వల = వెలుగొందుచున్న, భక్తి పట = భక్తియనెడు వస్త్రముచేత, ఆవృతవృత్తం = కప్పబడిన మూర్తిగలవానిని, కర్మకలేవరం = కర్మాచరణ ప్రవృత్తకాయము గలవానిని, అద్భుతచేష్టం = అద్భుతములైన చేష్టలు గలవానిని, భవవైద్యం = సంసార రోగములకు వైద్యుడైనవానిని, గురుం = రామకృష్ణుని, శరణం యామి = శరణు పొందుచున్నాను.

తాత్పర్యము:- అద్వైతతత్త్వ ప్రవృత్త చిత్తుడును, ఉజ్వలమైన భక్తి వస్త్రముచేత ఆచ్ఛాదింపబడిన వృత్తముగలవాడును, కర్మాచరణశీలుడును, అద్భుతచేష్టలు గలవాడును, భవవైద్యుడును అయిన గురువును ఆశ్రయించుచున్నాను.

అలంకారము-భక్తిపటము. రూపకము.

## రామకృష్ణస్తుతి

శ్లో. స్థాపకాయ చధర్మస్య సర్వధర్మస్వరూపిణే
అవతారవరిష్ఠాయ రామకృష్ణాయతేనమః

టీక:- ధర్మస్య = ధర్మముయొక్క, స్థాపకాయ = స్థాపకుడవు, సర్వ ధర్మ స్వరూపిణే = సకలధర్మస్వరూపుడవు, అవతారవరిష్ఠాయ = అవతారశ్రేష్ఠుడవు, రామకృష్ణాయ = రామకృష్ణుడవైన, తే = నీకు, నమః = నమస్కారము.

తాత్పర్యము :- ధర్మస్థాపకుడవు, సర్వధర్మ స్వరూపుడవు, అవతారశ్రేష్ఠుడవు, రామకృష్ణుడవు అయిన నీకు నమస్కారము.

# వివేకానంద కవితావైభవం

## ఆంగ్ల కవిత

వివేకానందుని ఆంగ్ల కవితలన్నీ దాదాపు 1893-1902 మధ్యకాలములో వెలిసినవే. అసలు చికాగో మత మహాసభలో చేసిన తొలి ఉపన్యాసముతో ఆతని ఆంగ్ల సారస్వతము ప్రారంభమైనదని భావించుట లెస్స. ఈ కవితలన్నీ విషయ వైవిధ్యము గలిగి భవ్యకవితావేశముతో వ్రాసినవే. దేశభక్తి, మానవతా దృక్పథము, విశ్వమానవ సోదరభావము ఈతని కవితలకు ప్రధాన ప్రాతి పదికలు.

### 1

సిస్టర్ నివేదిత పాశ్చాత్య వనిత. వివేకానందుని బోధనలచేత ప్రభావితు రాలై భారతదేశ సేవకు తన జీవితమును అంకితము చేసిన మహనీయురాలు. ఆమె తొలిదశలో భారతదేశ సేవ చేయుటకు నిశ్చయించుకొని మార్గదర్శనము చేయవలసినదని కోరుతూ, వివేకుని ఆశీస్సుల నడిగినది. అప్పుడు వివేకా నందుడు సెప్టెంబర్ 22, 1900 నాడు ఆమెకు వ్రాసిన లేఖలో పొందుపరచిన 'Benediction' అన్న పేరుతో వ్రాసిన ఈ కవిత ప్రఖరమైన దేశభక్తి పూరితముగను స్ఫూర్తిదాయకముగను ఉన్నది. ఆ కవిత ఇది :—

A BENEDICTION

The mother's heart, the hero's will
    The sweetness of the southern breeze,
The sacred charm and strength that dwell
    On Aryan altars, flaming, free;
All these be yours, and many more
    No ancient soul could dream before—
Be thou to India's future son
    The mistress, servant, friend in one.

భారత మాతృహృదయమును, ఇచటి వీరుల ఆత్మ స్థైర్యమును ఆవాహన చేసి కొని ఇచట వీచు మలయపవనంపు కొదమల మధురిమల నాస్వాదించుచు, ఈ ఆర్యపీఠాలపై వెలుగొందుతున్న మహాపురుషుల ఆత్మజ్యోతుల కాంతులలో స్ఫూర్తిని పొందుతూ, సేవకురాలుగా, స్నేహితురాలుగా, సర్వలక్షణములను పుణికి పుచ్చుకొని ఈ దేశమునకు సేవ చేయమని చెప్పిన ఒక దివ్యమైన దేశభక్తి ఖండమిది.

## 2

వివేకానందుడు గొప్ప మానవతావాది. మానవునిలో భగవంతుని చూసిన మహనీయుడు. మానవుని సేవించటమే పరమధర్మమని ఆతని ఆశయము. ఆ యాదర్శమును బోధించు ఈ కవితా ఖండిక మనకు శిరోధార్యము. "The living God" అను పేరుగల ఈ కవిత వివేకానందుడు అల్మోరా నుండి 9, జూలై 1897లో ఒక అమెరికా మిత్రునకు వ్రాసిన లేఖలో పొందుపరచ బడినది.

### THE LIVING GOD

He who is in you and outside you,
Who works through all hands,
Who walks on all feet,
Whose body are all ye,
Him worship, and break all other idols !

He who is at once the high and low,
The sinner and the saint,
Both God and worm,
H.m worship-visible, knowable, real, omnipresnt,

In whom is neither past life
Nor future birth nor death,
In whom we always have been
And always shall be one,
Him worship. Break all other idols !

Ye fools ! who neglect the living God,
And His infinite reflections with which the
world is full.
While ye run after imaginary shadows,
That lead alone to fights and quarrels,
Him worship, the only visible !
Break all other idols !

భగవంతుని తేజోంశ సంభూతుడే మానవుడు. మన కళ్ళ యెదుట నడయాడుతున్న ఈ భగవంతుణ్ణి త్రోసి రాజని కలహములకు దారి తీయు ప్రతీకలను పూజించుట మూర్ఖత్వమని యాతని నిష్కర్ష.

ఇదే లేఖలో ఈ కవిత క్రింద వ్రాయబడిన ఈ క్రింది వాక్యములను గమనించినచో, జీవుడే శివుడు అన్న ఆతని మానవతా దృక్పథము మరింత విశదమగును.

'May I be born again and again, and suffer thousands of miseries so that I may worship the only God that exists, the only God I believe in, the sum total of all souls-and above all my god the wicked, my God the misecrable, my God the poor of all races, of all species, is the special onject of my worship.'

దీనులైన మానవులను సేవించుటకు, ఎన్ని జన్మములనైనను ఎత్తి, ఎన్ని కష్టములనైననూ తాననుభవించునట. అతని ఏకైక లక్ష్యము మానవసేవయే. పై కవితలో "Break all other idols" అన్న మాటను పట్టుకొని, వివేకానందుడు మూర్తి పూజకు వ్యతిరేకి యని భావింపరాదు. మానవసేవకు ఇవ్వవలసిన ప్రాధాన్యతను నొక్కి చెప్పుటకు మాత్రమే ఒక భావావేశమున అట్లు వ్రాసినట్లు భావింపవలయును. వివేకానందుడు మూర్తి పూజను గట్టిగా సమర్థించిన వ్యక్తి.

### 3

ప్రజా సేవా మార్గము పూలబాట కాదు. కంటకాకీర్ణము. ఎన్నియో కష్టములు వచ్చి పడుచుండును. వాటిని తట్టుకొని ముందుకు పోవుట దీక్షా పరుని

లక్షణము. ఆ విషయమును ఒక చక్కని కవితలో వివేకానందు డిట్లు తెలిపినాడు.

## TO AN EARLY VIOLET

What though thy bed be frozen earth,
They cloak the chillingblast,
What though no mate to cheer thy path,
Thy sky with gloom O' ercast—
What though if love itself doth fail,
Thy fragrance strewed in vain,
What though if bad O'er good prevail,
And vice o'er virtue reign—
Change not thy nature, generle bloom,
Thou violet, sweet and pure,
But ever pour thy sweet perfume
Unasked, unstinted, sure !

వయొలెట్ పాశ్చాత్య దేశములలో వసంత ఋతువున విరియబూచు పువ్వు, ఒక్కొక్కప్పుడది వసంతము రాకపూర్వము హేమంతము, ఇంకనూ విడిపోకముందు పూచుట కద్దు. అప్పుడు హేమంతపు చలి దానిని బాధించును. దానిని తట్టుకొన్నచో సరి. లేనిచో రాలిపోవును. ఎట్లయినను తట్టుకొని ముందుకు పొమ్మని కవిచేయు ప్రబోధమిది. ఇది అన్యాపదేశ కవిత. కర్తవ్య పరాయణుడైన వ్యక్తి చేయు హెచ్చరిక యిది.

నీవు శయనించునది కఠిన శిల కావచ్చును. నిన్ను చలి బాధింపవచ్చును. నిన్ను మెచ్చుకొను సహచరుడు లేకపోవచ్చును. నీపై మబ్బులు ముసరవచ్చును. నీ ప్రేమ విఫలము కావచ్చును. నీ పరిమళము వ్యర్థము కావచ్చును. నీ మంచిని చెడు ఆక్రమింపవచ్చును. తాత్కాలికముగ నీ పుణ్యమును పాపములోగొన వచ్చును. అయినను నీ స్వభావమును, నీ మంచితనమును మాధుర్యమును, పవిత్రతను వీడకుము. నీ కమ్మని సుగంధమును వెదజల్లుచునే పొమ్ము.

ఇది వివేకానందుడు తన శిష్యురాలగు ఒకానొక విదేశీ వనితకు 6 జనవరి 1896 లో న్యూయార్కు నుండి వ్రాసిన కవిత.

## 4

ఆంగ్ల భాషలో ఎలిజీ (Elegy) అను ఒక సాహిత్య ప్రక్రియ గలదు. ఇది దుఃఖమును వ్యక్తము చేయుటకు వ్రాయు కవితా ప్రక్రియ, సాధారణముగా చనిపోయిన వారిని గూర్చి వ్రాయుట పరిపాటి. జె.జె. గుడ్విన్ అను యువకుడు వివేకానందుని శిష్యుడు వివేకుని ఉపన్యాసముల నన్నింటికీ ఈతడు Stenographic notes వ్రాయుచుండెడివాడు. ఈతని వయస్సు 28 సంవత్సరములు. భారతదేశమున ఉదక మండలమున నివసించుచూ మరణించినాడు. ఇది వివేకానందునకు పిడుగు పడినట్లయ్యెను. ఇక తాను బహిరంగ సభలలో నుపన్యసించు కాలము గతించినదని విచారించెను. ఒక కవితను వ్రాసి గుడ్విన్ తల్లికి పంపించెను. ఆమె వితంతువు.

### REQUIESCAT IN PACE

Speed forth, O soul ! upon thy star-strewn path,
Speed, blissful one! where thought is ever free,
Where time and space no longer mist the view,
Eternal peace and blessings be with thee !
Thy service true complete thy sacrifice,
Thy home the heart of love transcendent find,
Rememberance sweet, that kills all space and time
Like altar rosses fill thy place behind !
Thy bonds are broken, thy quest in bliss is found,
And one with That which comes as Death and Life,
Thou helpful one ! unselfish e'er on earth,
Ahead ! still help with love this world of strife !

హే ఆత్మన్! వేగముగా సాగిపొమ్ము! దివ్యకాంతిపూతంబగు పథమునందు పయనించుము. ఆనందపూర్ణమా! ఏ తాపమునకు తావులేని ఆనందధామమునకు వేగపొమ్ము. దేశకాలమానములని అడ్డుతెటలు వేయలేని ఆ లోకము చేరుమింక. శాశ్వతమౌ ఆనందము శాంతి యచట లభించును. నీ చేసిన సేవలకును, త్యాగమునకు సాఫల్యము సమకూరును. నీ తావును, నీ తల్లిని పరమా

త్ముడు కరుణించును. మధురములౌ నిను గూర్చిన స్మృతులవ్వియె మట్టుపెట్టు దేశకాలమానమ్ముల ఆ స్మృతులే ఆర్యపీఠ పుష్పములై నీ విడిచిన తావు నింక నింపివేయు చింతతీర. బంధనములు తెగిపోయెను. నీ తహతహ తనివితీర లభియించును ఆనందము...సాయపడిన స్నేహితుడా!స్వార్థరహిత మానవుడా! సాగిపొమ్ము ముందుకింక. ఇంకముందుకూడ మాకు సాయపడుము ప్రేమతోడ. చెదలుపట్టు లోకమ్మిది. సాయపడుము సహచరుడా!

సుప్రసిద్ధులయిన ఇంగ్లీషుకవు లనేకులు వ్రాసిన "Elegy"ల కంటె ఇది చాల గొప్పదని చెప్పవచ్చును. ఆత్మను గూర్చిన పరిజ్ఞానము భారతదేశము సొమ్ము. ఈ కవితలో వివేకానందుడు ఆత్మను స్పృశించెను. ఇది పాశ్చాత్యు లకు చేతగాని పని. ఈ కవితను కవి అల్మోరానుండి జూన్ 1998లో, గుడ్విన్ మరణించిన వెంటనే పంపించెను.

## 5

మన విశ్వకవి వివేకానందునకు కవితా రూపమున Birth day Greetings పంపు సరదాకూడ కలదు. 22 సెప్టెంబరు, 1900 సం॥లో పారిస్‌లో ఉన్న తన విదేశీ శిష్యురాలు మిస్ ఆల్బెర్టా స్టర్గిస్ అను నామెకు ఆమె 23వ పుట్టినరోజు పండుగ సందర్భమున బ్రిట్టనీనుండి ఒక కవితను కానుకగా పంపించెను.

### MANY HAPPY RETURNS

The mother's heart, the hero's will,
The softest flower's sweetest feel,
The charm and force that ever sway
The altar fire's flaming play,
The strength that leads, in love obeys,
Far-reaching dreams, and patient ways,
Eternal faith in self, in all
The sight divine in great, in small
All these, and more than I could see
Today may 'Mother' grant to thee.

తల్లి హృదయము, వీరుల ఆత్మశక్తి, మృదువైన పువ్వుయొక్క మధుర మైన అనుభూతి, ఆర్యపీఠాలపై వెలుగొందుతున్న దివ్యదీపముల శోభ, తేజస్సు, ఓజస్సు తెలియాడించు నునువెచ్చని పసిమికలల ఫలములు, సహనశీలత, చెద అని ఆత్మవిశ్వాసము, చిన్నపెద్దల శుభదృష్టి, మొ॥ ఆ తల్లి నీకు అనుగ్రహించుగాక.

ఈ కవిత సిష్టర్ నివేదితకు పంపించిన "A Benediction" కవితను పోలియుండుట గమనింపవచ్చును.

## 6

వివేకానందుడు ఏది చెప్పినను బల్లగుద్దినట్లు చెప్పుచుండెడువాడు. అట్లు చెప్పుటవలన కొన్ని చిక్కులు వచ్చుననియు, కొందఱకు కష్టము కలుగుననియు కావున ఆ ధోరణి కూడదనియు మిస్ హేల్ ఆయనకు సలహాను ఇచ్చెను. వివే కుడు దానికి మఱింత గట్టిగా సమాధానము పంపెను. ఇది మిస్ హేల్‌కు కష్టము కలిగించెను. దానిని పాటించక తన అభిప్రాయమును సమర్థించుకొనుచు స్వామి ఆమెకు ఈ కవితను వ్రాసిపంపెను. ఇది 15 ఫిబ్రవరి 1895 లో న్యూయార్కు నుండి వ్రాసినది.

### THE SONG OF THE FREE

The wounded snake itshood unfnrls,
The flame stirred up doth blaze,
The desert air resounds the calls of heart-struck lion's rege
........From dreams awake, from bonds be free !
Be not afraid, This mystery. My shadow,
cannot frighten me !
Know once for all that I am He'!

దెబ్బతిన్న పాము పడగ విప్పును. కదిలించిన నిప్పు చెలరేగును. ఎడారి గాలి విజృంభించిన సింహగర్జనకు మార్మోగును...కలల నుండి మేల్కొనును. బంధనములను విడిచిపెట్టును. భయపడదు. ఈ మాయ, ఈ ఛాయ, నన్ను భయపెట్టలేదు. నేనతడినే.

అహం బ్రహ్మ-అని తాత్పర్యము. అట్టివానికి, సర్వసంగ పరిత్యాగికి భయమెందుకు ?

7

"ప్రబుద్ధ భారత్" వివేకానందుని ఆధ్వర్యమున నడుపబడుచుండెడు సుప్రసిద్ధ పత్రిక. ఈ పేరు పెట్టినది వివేకానందుడే. ఇది మద్రాసు నుండి అల్మోరాకు మారినది. ఈ పత్రికకు జూన్ 1898 లో "To the awakened India" అను సుప్రసిద్ధ కవితను శ్రీనగర్‌లో వ్రాసి, ఆగస్టు 1898 లో పత్రికకు పంపెను. ఆ కవిత యొక్క ప్రారంభ వాక్యములివి.

THE AWAKENED INDIA

Once more awake !
For sleep it was, not death, to bring thee life
A new and rest to lotus-eyes, for visions
Daring yet. The world in need awai ts O Truth
No death for three !

నిద్ర చావు కంటె ప్రమాదకరమనియు, మరణించినవాడు మరల పుట్టి క్రొత్త బలముతో ఏదైన ఘనకార్యము చేయుట కొక అవకాశముండుననియు, కాని నిద్రాసక్తుడు నిర్వీర్యుడై నిరుపయోగియగుననియు, అది జాతికి నష్టమనియు వివేకుని నిష్కర్ష. నిద్రాసక్తుకు కన్నులు మూయుట ధ్యాన నిమగ్నుడై ఏదేని సాక్షాత్కారము పొందుటకు కాదు. అది నాశనమును కొనితెచ్చుకొనుటకే యని స్వామి సందేశము. కర్తవ్యనిష్ఠుడై చురుకుగా పనిచేయుచు జాతికి మేలుచేయ వలెనని తాత్పర్యము. సత్యమునకు చావులేదు !

8

మబ్బులు సూర్యుని కప్పివేయవచ్చును. కాని అవి యెల్లకాలమట్లే యుండవు. ఎప్పటికైనను తొలగిపోవును. అట్లే కర్తవ్య నిష్ఠునకు కార్యసాధనలో కొన్ని కష్టములు రావచ్చును. హృదయము చిక్కపట్టి ఓపికతో ప్రవర్తించ వలయును. అంతిమ విజయము, తప్పక చేకూరును అను భావముగల కవిత ఇది.

ఇది ఖేత్రీమహారాజునకు వ్రాసిన కవిత.

## "HOLD ON YET A WHILE BRAVE HEART"

If the sun by the cloud is hidden a bit,
If the welkin shows but gloom,
Still hold on yet a while, breave heart,
Victory is sure to come.

ఖేత్రీమహారాజు ఒక వేశ్య యొనర్చుచుండిన గానమును వినుటకు వివేకానందుని ఆహ్వానించెను. తాను సన్యాసిననియు కావున రాజాలనని యు మొదట తిరస్కరించెను. పిమ్మట ఆమె సూరదాసు రచించిన ఒక దివ్య కీర్తనమును పాడుచుండగా విని స్వామి అచటి కేగెను. ఆ కీర్తన యొక్క తాత్పర్యమిది.

"పరమేశ్వరా! నా దుర్గుణములను పరిగణింపకుము. నీవు సర్వసముడవు. ఇక ఇనుపముక్క దేవాలయములోని విగ్రహమగుచున్నది. మరొకటి కసాయివాని కత్తి యగుచున్నది. కాని రెంటను పరశువేది తగిలినంతనే బంగారమగుచున్నవి గదా!"

ఈ హిందీ కవితను వివేకానందుడు ఆంగ్లములోనికి అనువదించెను.

## A SONG OF SURADASA

O Lord, look not upon my evil qualities !
Thy name, O Lord, is Same-Sightedness,
Make of us both the same Brahman !
One drop water is in the sacred Yamuna,
And another is foul in the ditch by the roadside,
But when they fall into the Ganga, both alike become holy.
So Lord, look not upon my evil qualities,
Thy name, O Lord, is Same-sightedness,
Make of us both the same Brahman !
One piece of iron is the image in the temple,
And another is the knife in the hand of the butcher,

But when they touch the philosopher's stone,
both alike turn to gold.
So Lord, look not upon my evil qualities,
Thy name, O Lord, is same-sightedness,
Make of us both the same Brahman!

భగవంతుని దృష్టిలో అందరూ సమానులే అన్నది యిందలి పరమార్థము. ఆ వేశ్యలో హృదయ పరివర్తనమును గమనించినాడు వివేకుడు. అట్టి వారిని సానుభూతితో చూడవలయును అన్నది ఆతని యాశయము. ఇది స్త్రీల విషయమున మఱింత ముఖ్యమని ఆతడు భావించినట్లు తోచుచున్నది.

## 10

మనిషి ప్రతిదానికి భయపడుచునే ఉండును. ఆ భయము ఎన్ని విధములుండునో సంస్కృత భాషలో భర్తృహరి తన వైరాగ్య శతకములో కొన్ని శ్లోకములలో వ్రాసినాడు. అవి వివేకానందుని ఆకర్షించినవి. వాటిని ఒక చోట చేర్చి ఒక కవితను అల్లినాడు.

### RENUNCIATION ALON IS FEARLESS

In enjoyment is the fear of disease,
In high birth, the fear of losingcaste,
In wealth, the fear of tyrants,
In honour, the fear of losing (it),
In strength, the fear of enemies,
In beauty, the fear of (old age),
In knowledge, the fear of defeat,
In virtue the fear of scandal,
In the body, the fear of death,
In this life all is fraught with fear :
Renunciation alone is fearless.

సుఖించినచో రోగము వచ్చునను భయము! గొప్ప కులమున పుట్టినచో కులము పోవునేమో అను భయము! ధనమున్నచో దొంగల భయము! గౌరవ

మర్యాదలున్నచో అవి పోవునేమోనన్న భయము ! బలమున్నచో శత్రువుల భయము! అందమున్నచో ముసలితనము వచ్చునన్న భయము! జ్ఞానమున్నచో ఓడిపోవుదునన్న భయము! మంచితనమున్నచో మోసాన్ని గూర్చిన భయము! శరీరమున్నచో మరణింతునన్న భయము. జీవితంలో అన్నిటినీ భయము వెంటాడును! కావున సర్వసంగ పరిత్యాగమే నిర్భయత్వము.

## 11

వివేకానందుడు మిస్ జోసెఫిన్ అను నామెకు బేలూరు మఠంనుండి 26 డిసెంబరు 1900 లో వ్రాసిన లేఖలో భాగముగ ఒక చిన్న కవితను వ్రాసెను. సర్వత్ర, సర్వావస్థలలోను ఒక అనిర్వాచ్యమగు తేజః పుంజము ప్రకాశించుచునే యుండును అని దాని భావము. అనగా భగవంతుడు సర్వాంతర్యామియనుట.

### LIGHT

I look behind and after
And find that all is right,
In my deepest sorrows
There is a soul of light.

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3